# ప్రపంచాధిపత్యంకోసం

# అమెరికా యెత్తులు



రచన:

క్లాడ్. యఫ్. పెప్పర్



ప్రజా ప్రచురణాలయం హైదరాబాద్

# ప్రపంచాధిపత్యంకోసం
# అమెరికా యెత్తులు

*

రచన

క్లాడ్. యఫ్. పెప్పర్.

అనువాదం

వాశిరెడ్డి భాస్కరరావు

*

ప్రజా ప్రచురణాలయం,

నారాయణగూడ, హైదరాబాదు (దక్కన్.)

# ప రి చ య ం

★

అమెరికా అటంబాంబు రహస్యం తన చేతిలో పెట్టుకొని. ఆ బలంతో ప్రపంచాధిపత్యంకోసం ప్రయత్నిస్తూవుంది. అమెరికాలో సంవత్సరానికి 9 కోట్ల టన్నులు ఉక్కును తయారుచేయగలరు. ఇది ప్రపంలో అన్నిదేశాలకన్న నేడు ఆర్థికంగా, బలిష్టమైన దేశం. విమానబలంలోను, నౌకాబలంలోను, ఆయుధపరిశ్రమలోను బలిష్టమైనదేశం. అమెరికాలోని పెట్టుబడిదారులు, ప్రపంచాన్నంతా తమ యాజమాన్యం క్రింద వుంచుకోవాలని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని తమచేతిలో కీలుబొమ్మగా జేసుకుంటున్నారు. వివిధదేశాలలో అభివృద్ధి విరోధకులను ప్రోత్సహిస్తున్నారు. చైనాలో కుమింగుటాంగ్‌ను, జపానులో హిరోహిటో చక్రవర్తిని, జర్మనీలో నాజీపెట్టుబడిదారులను బలపరుస్తున్నారు. అమెరికా సామ్రాజ్యవాదుల ఎత్తులను ప్రతిదేశంలోను ప్రజాశక్తులు యూరపులోని నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాలు ఎదుర్కొంటున్నాయి. అమెరికా సామ్రాజ్యవాదుల ఎత్తులను భగ్నంచేస్తూ సోవియట్ ప్రపంచ శాంతికి, ప్రపంచ పునర్నిర్మాణానికి కృషిచేస్తూవుంది.

అందుచేతనే ఈ రోజు సామ్రాజ్యవాదులు సోవిటుమీద అనేక విష ప్రచారాలు సాగిస్తున్నారు. సోవియటుయూనియన్ తన అధికారప్రాబల్యం కోసం చిన్నరాజ్యాలపై పెత్తనం సాగిస్తున్నదని రోజూ విందలు పత్రికలలో వస్తున్నాయి.

నిజపరిస్థితులేమిటో, ప్రపంచశాంతికి మార్గమేమిటో క్లాడ్.ఎఫ్.పెప్పరు అమెరికా సెనేటులో (పై శాసనసభలో) ఉపన్యసించాడు. ఈయన కమ్యూనిస్టుకాడు. అయినప్పటికీ ప్రపంచశాంతిని సౌభాగ్యాన్నికోరే ప్రజా

తంత్రవాది కాబట్టి తన అమెరికా వెళ్లుతున్న పంథాలోవున్న ప్రమాదాన్ని గూర్చి ఆవేశభరితుడై హెచ్చరిక జేశాడు.

ఈ ఉపన్యాసం మార్చినెలలో ఇచ్చాడు. అయినానేటికీ ప్రపంచ పరిస్థితులు సరిగా అర్థంజేసుకోడానికి పాఠకులకు ఇది ఎంతో తోడ్పడు తుంది.

తూర్పుయూరపు దేశాలలో ప్రజాతంత్ర ప్రభుత్వాలు ఏరీతిగ నూతన జీవితాన్ని నిర్మిస్తున్నదీ, వానిపై బ్రిటిషు అమెరికా సామ్రాజ్యవాదులు చేస్తున్న దుష్ప్రచారాన్ని ఖండిస్తూ సోవియటు పత్రిక 'న్యూటైమ్సు'లో పడిన ఒక ముఖ్యమయిన వ్యాసంకూడా దీనిలోచేర్చి ప్రకటించటం చాలా సమంజసంగావుంది.

— పుచ్చలపల్లి సుందరయ్య



# ప్రపంచాధిపత్యంకోసం అమెరికా యెత్తులు

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంనాటి ఆ భయంకర దృశ్యాలు ఇంకా మన కండ్లకు గట్టినట్లు కనిపిస్తూనే ఉన్నాయి. అప్పుడే మళ్ళీ తృతీయ ప్రపంచ యుద్ధమేఘాలు ఆకాశం అంతటా ఆవరిస్తున్నాయి. యుద్ధ భయంతో నేడు ప్రజాసామాన్యహృదయం అట్టుడికినట్టు ఉడికిపోతూఉంది. ఈలాంటి విషమ పరిస్థితుల్లో యుద్ధాన్ని తీవ్రంగా ఖండిస్తూ, యుద్ధాన్ని పురికొల్పే వారిచర్యల్ని గురించి నిర్మొగమాటంగా కొన్నిమాటలు చెప్ప దలచుకున్నాను.

ఒక్క అమెరికానే కాకుండా యావత్ప్రపంచాన్ని మరో భయంకర యుద్ధ ప్రమాదం ఎదుర్కోబోతూఉంది. కాబట్టి ఖచ్చితంగా ఈ విష యాన్ని గురించి ఉన్నదున్నట్లు చెప్పివేయడం ఈ నాడు ఎంతైనా అవసరం.

దేశదేశాల్లో ద్వీపద్వీపాల్లో ఉన్న మన సైనికులు ఇ తవరకు ఇంకా తమ ఇండ్లకు తిరిగి రానేలేదు. యుద్ధంలో కాళ్లూ చేతులు విరిగ పోయిన వికలాంగులకు కావాలిసిన పరికరాలు ఇంతవరకు ఏర్పాటు చేయనే లేదు. యుద్ధంలో తగిలిన గాయాలు ఇంకా పూర్తిగా నయమైనా కాలేదు. క్షతగాత్రుల్ని, జబ్బుపడ్డవాళ్ళని ఇంతవరకు పూర్తిగా ఆసుపత్రుల్లోనైనా చేర్చలేదు. యుద్ధ కారణాలవల్ల అనేక కష్టనష్టాలకు గురియైన సోదరులు ఇంకా కోలుకోనే లేదు. నూతన జీవితవిధానం ఇంకా ఏర్పడనేలేదు. రెండో ప్రపంచయుద్ధం పూర్తి అయిందో లేదో అప్పుడే కొందరు బాధ్య తగల వ్యక్తులే మూడో ప్రపంచయుద్ధాన్ని గురించి మళ్ళీ కేకలు వేస్తున్నారు.

పరిస్థితులు మనచేతుల్లోనుంచి పూర్తిగా జారిపోకముందే ఇలాంటి పిచ్చిచేష్టల్ని వెంటనే మాన్పించాలి. పురాతన శిథిలాల్లోనుంచి పునరావిర్భ విస్తూఉన్న నూతన ప్రపంచాన్ని ఒకసారి మనం పరిశీలించాలి. ప్రజల విజ్ఞప్తిని ఆలించాలి. అమెరికా సైనికులు ఎత్తిన కత్తుల్ని ఇంకా దింప నేలేదు. అప్పుడే మళ్ళీ మూడో ప్రపంచ మహాయుద్ధమా? దేశదేశాంత

రాల్లో ఉన్న సైనికులు తమ ఇండ్లకు తిరిగివచ్చి పెండ్లాం బిడ్డలతో కలుసుకొని ఒక్కసారిఅయినా మాట్లాడుకోక ముందే మళ్ళీ యుద్ధరంగానికి సిద్ధం గమ్మని ఉత్తరువులు జారీ చేయడమా? ఇంతటితో యుద్ధ పిశాచికి శాశ్వతంగా గోరీ గడుతున్నాం అని నిన్న మొన్ననే కదా చెప్పింది? గోరీలో అయిదు నిలువుల లోతున పాతిపెట్టిన యుద్ధ పిశాచి నేడు మళ్ళీ ఎలా తల ఎత్తింది?

## యుద్ధ నినాదాలు ఎటునుంచి వస్తున్నాయి?

తళ తళ లాడే కత్తులు ఝుళిపిస్తూ మళ్ళీ యుద్ధరంగానికి రమ్మని నేడు మనల్ని సవాలు జేస్తూవుంది ఎవరు?

శత్రువులందర్నీ ఊచకోతగోసి నిన్న మొన్ననే కదా పాతిపెట్టింది! ఈ పాతిపెట్టబడిన శత్రువులు, గోరీలు పగల గొట్టుకొని హఠాత్తుగా మళ్ళీ లేచి వచ్చారా?

అలా రావడం అసంభవం. అది ఎన్నటికీ జరగదు. జర్మనీ జపాన్ దేశాలు, వాటి ఉపగ్రహాలు ధ్వంసమయ్యాయి. ఇప్పుడీ యుద్ధనినాదాలు వినిపిస్తూఉంది ఆదేశాలనుంచి కాదు. ఆదేశస్థుల వైపునుంచికాదు.

ఫాసిస్టుల్ని ఓడించడానికి అమోఘంగా కృషిజేసిన మిత్రమండలిలో నుంచే ఈ యుద్ధ నినాదాలు వినపడుతూవున్నాయి.

ఫాసిస్టులతో కలసి మెలసి యుద్ధంజేసిన అగ్రరాజ్యాలు నేడు ప్రపంచంలోకల్లా బలిష్ఠమైన శక్తిసామర్థ్యాలు కలిగి ఉన్నాయి. ఈ దేశాల్ని తోసివేయగలశక్తి ప్రపంచంలో మరేదేశానికి లేదు. అయినప్పటికి యుద్ధోన్మాదం నేడు మళ్ళీ మితిమీరిపోతూంది. మ్యూనిచ్‌కు పూర్వం ఎటువంటి ఆవేశాలు కావేశాలు పెరిగాయో ఇప్పుడుకూడా అలాగే పెరుగుతూఉన్నాయి. గతరెండు ప్రపంచ యుద్ధాలకుపూర్వం పరిస్థితి ఎలా ఉందో ఇప్పుడూ అలాగే పట్టుదలలు శృతిమించి రాగాన పడుతున్నాయి. లక్షల కొలది ప్రాణాలు బలి ఇచ్చి సాధించిన శాంతిసౌఖ్యాలు ధ్వంసమై పోక ముందె, సిరిసంపదలతో పాడిపంటలతో తులతూగుతూ నిత్యకల్యాణం పచ్చతోరణంగా నిర్మించ బడబోయే నూతనప్రపంచాన్ని మన చేతులారా మళ్ళీ యుద్ధరంగంలోకి యీడ్చి ఈ నందనవనాన్ని శ్మశానంగా మార్చి వేయకముందే తృతీయ ప్రపంచ మహాయుద్ధంవల్ల ఎటువంటి మహా ప్రమాదాలు రాబోతున్నాయో ప్రజలందరికీ విశదంగా తెలియపరచడం

ఎంతో అవసరం. బుద్ధిపూర్వకంగా యుద్ధానికి పురికొల్పే వాళ్ళు ఎటు వంటి పచ్చిఅబద్ధాలు ప్రచారం చేస్తున్నారో వీటివల్ల సమస్త మానవజాతికి ఎటువంటి మహాప్రమాదం వాటిల్లనున్నదో ప్రతివాడు తెలుసుకోవాలి.

ప్రపంచంలో ఒకవైపు జాతీయ దురహంకారం ప్రబలిపోతూంది. మరోవైపు సామ్రాజ్యవాదుల గొంతెమ్మకోరికలకు అంతూపంతూ లేకుండా ఉంది. యుద్ధకాలంలో దెబ్బతినిపోయిన తమ సామ్రాజ్యాన్ని తమ పరిశ్రమల్ని ఏదో ఒకవిధంగా మళ్ళీ నిలబెట్టుకోడానికి పెట్టుబడిదారులు అనేక ఎత్తులు వేస్తున్నారు. యుద్ధోన్మాదం రేకెత్తిస్తూ ఉన్నారు. జాతీయ దురభిమానాన్ని రెచ్చగొడుతున్నారు. అనేక అభూత కల్పనలు కల్పించి తోటి మిత్రదేశాల్ని అపనిందలపాలుజేస్తున్నారు. ఈ దుష్ప్రచారం నానాటికి హద్దూపద్దు లేకుండా పెచ్చుపెరిగి పోతూఉంది.

ముఖ్యంగా అగ్రరాజ్యత్రయాన్నే తీసుకొని మాట్లాడదాం. ఈ మూడు రాజ్యాలు ఇప్పుడు చేస్తూవున్న పని ఏమిటి?

## అమెరికా యేమిజేస్తూవుంది?

ముందు మన విషయమే తీసుకుందాం. "ఎన్నాళ్ళనుంచో తమ పెండ్లాం బిడ్డల్ని వదలిపెట్టి నావికులుగా వైమానికులుగా సైనికులుగా ఎక్కడెక్కడో దూరదేశాల్లో పని చేస్తూఉన్న సోదరులందర్నీ వెంటనే తమ ఇండ్లకు తిరిగి రానివ్వాలి." అని మనం ప్రభుత్వాన్ని పూర్తిగా ఒత్తిడిచేశాం. "మనకు పది లక్షలకు పైగా సైన్యం, అయిదులక్షల నౌకా సైన్యం, వెయ్యిఓడలు, ఎప్పుడు అవసరమైతే అప్పుడు సిద్ధంగా ఉండాలి. మననౌకాసైన్యం ప్రపంచంలోకల్లా బలిష్ఠమైనదిగా ఉండాలి. ప్రపంచంలోవున్న అన్నిదేశాల నౌకా సైన్యంతో మన ఒక్క నౌకా సైన్యమే సరిసమానంగా ఉండాలి." అని అమెరికా కాంగ్రెసులో పదే పదే ప్రతిపాదించబడుతూవుంది.

అయిదులక్షల వైమానికులు, సప్తసముద్రాల్లో స్వేచ్ఛావిహారం చేయదగిన నావికులు, మనకు సిద్ధంగా ఉండాలని కాంగ్రెసుకు అనేక మంది పెద్దలు సలహాలిస్తూన్నారు.

శాంతిసమయంలో కూడా నిర్బంధ సైనిక విద్యా విధానం అమలు పరచాలని కొందరు ప్రతిపాదిస్తూ ఉన్నారు.

యుద్ధపరికరాలకి కావాలసిన సామగ్రిఅంతా సిద్ధంగా ఉంది. అలాటి సామగ్రిని పూర్తిగా సేకరించి యుద్ధపరికరాల్ని ఇంకా అధికంగా ఉత్పత్తి చేయాలని మనకు పదేపదే బోధిస్తూఉన్నారు.

"అనేక ప్రధానకీలక స్థానాల్ని మనకు రక్షణవలయంగా ఏర్పరచుకోవాలి చైనా సముద్రతీరం నుంచి శాన్‌ఫ్రాన్సిస్కో వరకు ఉన్న ఆరు వేలమైళ్ళదూరం మనకు పెట్టని కోటగా ఉండాలి. ఆర్కిటిక్ మహాసముద్రాన్నుంచి అంటార్కిటిక్ మహాసముద్రం వరకు మనం స్వేచ్ఛావిహారం చేయగలగాలి ఇదివరకు జపాన్ ఆక్రమించుకున్న మారియన్నాదీవులు, కరోలినాదీవులు మన పటకు బకిలో ఉండాలి. అట్లాంటిక్ సముద్రంలో ఉన్న కీలకస్థానాలుకూడా మన చేతిలో ఉండాలి." అని అనేక కోరికలు వెల్లడించబడుతూ ఉన్నాయి.

"అన్నిటికంటె ముఖ్యం అటంబాంబు. సైంటిస్టులు ఎంతవ్యతిరేకించినా, లేక రాజీనామాలిచ్చినాసరే మనకు అవకాశం దొరికినప్పుడు అటంబాంబుల్ని అధికంగా ఉత్పత్తి జేయాలి. యుద్ధవిధానంలో అటంబాంబు ఒక మహత్తరమైన మార్పుతీసుక రాబోతూ ఉంది. అటంబాంబు యొక్క ధ్వంసాత్మక శక్తిని ఇంకామనం ఎంతో అభివృద్ధిచేయాలి. అటంబాంబుయుగానికి తగిన కొత్తరకపు నౌకాసైన్యాన్ని నిర్మించాలి. ఈ మహత్తరమైన అటమిక్‌శక్తిని ఉపయోగించే అధికారం మిలిటరీ అధీనంలో ఉండాలి." అని అమెరికాలో కొందరు ప్రముఖులే వాదిస్తున్నారు.

"మనదేశానికి రెండువైపుల ఉన్న రెండుసముద్రాల్ని మనం రక్షించుకుంటే చాలు" అని ఇదివరకు వాదించే వాళ్ళే ఇప్పుడు ప్రపంచభద్రత అనే సాకుతో సప్తసముద్రాలమీద మనకు సర్వాధికారాలు గావాలని, ఉత్తర ధ్రువాన్నుంచి దక్షిణధ్రువం వరకు మన ఏకఛ్ఛత్రాధిపత్యం నెలకొల్పాలని ఉవ్విళ్ళూరుతున్నారు.

ఈ వ్యవహారం అంతా చూస్తూవున్న ఇతరదేశాలు, ఇతరజాతులు ఇదంతా అమెరికా దేశరక్షణ కోసమేనా? ఇది శాంతిభద్రతల్ని కాపాడే విధానమేనా?

అని ప్రశ్నిస్తున్నాయి.

## ఇక బ్రిటన్ విషయం చూద్దాం

బ్రిటిష్ టోరీలు సోషలిస్టులు కూడా తమ సామ్రాజ్యాన్ని కాపాడు కోడానికి ఒకే రకంగా తాపత్రయ పడుతున్నారు. ఇండియాకు వెళ్ళే రహదారులకు ఎక్కడ ముప్పు కలుగుతుందో ? అని ఆదుర్దా పడుతున్నారు. తమకు 1500 మైళ్ళ దూరంలోఉన్న మధ్య ధరాప్రాంతంలో మరెవరైనా ప్రవేశిస్తారేమో ? అని విచారపడుతున్నారు ఈ ప్రాంతాలన్నీ వాళ్ళ తాత గాడి మల్లె అయినట్లు.

నలభై లక్షల సైన్యాన్ని బ్రిటన్ ఇంకా సాయుధంగా ఎందుకు అట్టిపెట్టింది ? గ్రీసు, పాలస్తీనా, ఈజిప్టు, ఇండోనేషియా, ఇండియా, ఇండో చైనా, బర్మా, దేశాల్లో ఇంకా బ్రిటిష్ సైన్యం ఏందుకుండాలి ? ఒక వైపు బ్రిటన్ ఆర్థిక సంక్షోభంతో అల్లకల్లోలం అవుతూఉంది. బ్రిటిషు ప్రజలకోసం చేయాలిసిన పని ఎంతోఉంది. ఇలాటి ప్రధాన సమస్యలెన్నో ఉన్నా వాటన్నిటినీ పక్కకు తోసిరాజని ఇంత బ్రహ్మాండమైన సైన్యాన్ని సాయుధంగా అట్టిపెట్టడంలో చిదంబర రహస్యమేమిటి ? నౌకాసైన్యాన్ని, వైమానిక సైన్యాన్ని, ఇంకా అభివృద్ధి జేయడానికి అహోరాత్రాలు ఎందుకు పాటుపడుతూవుంది ? కొత్త కొత్త యుద్ధ పరికరాల్ని కనిపెట్టడానికి ఇంత ఆరాటమెందుకు ? ప్రతి చిన్న సమస్యమీద రెండునాలుకలతో ఎందుకు మాట్లాడాలి ? ప్రత్యేక సంధులకోసం నిరాక్రమణ ఒడంబడికల కోసం ఇంత హడావుడి ఎందుకు చేయాలి ?

ఒకవైపు ప్రపంచ భద్రతాసంఘం ఏర్పడి పనిచేస్తూవున్నా బ్రిటన్‌కి ఇంత యుద్ధోన్మాదం ఎందుకు ? అటంబాంబు రహస్యాన్ని అతి జాగ్రత్తగా కాపాడాలని అమెరికాతోపాటు తాళం వేయడంతో అర్థమేమిటి ?

## సోవియట్ పరిస్థితి

ఇక రష్యానుగురించి మాట్లాడదాం. రష్యా ఈనాడొక బలవత్తర మైనదేశం ఇటీవల జరుగుతూఉన్న ఈ కుతంత్రాల్ని చూస్తూఉంటే రేపటి పరిస్థితి ఇంకా ఎంత అధ్వాన్నంగా ఉంటుందో రష్యాకు బాగా తెలుసు. బ్రిటన్ అమెరికా దేశాల్ని రష్యా సందేహిస్తూఉంది ? మిత్రమండలిలో ఒక ప్రధాన భాగస్వామివి అయిన రష్యాకు అటమిక్ బాంబు రహస్యాలు చెప్ప నిరాకరించారు. రష్యా నౌకల రాకపోకలకు సముద్ర మార్గాలు తెర

వలేదు. కనీసం ఆర్థిక రాయబారాలు నడపడానికి కూడా అంగీకరించలేదు. ఈ పరిస్థితుల్లో రష్యా ఎందుకు అనుమానించదు ?

బ్రిటన్ అమెరికా దేశాల్లో జరుగుతూవున్న నాటకం అంతా రష్యా చూస్తూనే ఉంది. మన వార్తాపత్రికలు రష్యాకు కూడా పోతూఉంటాయి అనే విషయాన్ని మనం మరచిపోగూడదు. ఉన్నత పదవుల్లో ఉన్న పెద్దలు బాధ్యతలేకుండా ఏవిధంగా మాట్లాడుతున్నారో రష్యా గమనిస్తూనే ఉంది. మన కాంగ్రెసులో జరిగే చర్చల్ని పరిశీలిస్తూనే ఉంది. ఆర్థికంగా తనకు కొంత సహాయం ( ఋణం ) చేయవలసింది అని రష్యా కోరిన కోరికకు ఏగతి బట్టింది ?

" యుద్ధమూలకంగా రష్యా ఎంతో నష్టపడింది. దేశ పునర్నిర్మాణానికి, ప్రజల జీవిత పరిమాణాన్ని పెంచడానికి 600 కోట్లు అప్పు ఇవ్వాలిసింది అని అమెరికాను కోరాం. ఆరు మాసాలైనా ఇంతవరకు అతీ గతీ లేదు " అని స్టాలిన్ గత సెప్టెంబరులో నాతో చెప్పాడు.

ఈ సంభాషణ జరిగిన తర్వాత రష్యాలో ఉన్న అమెరికా రాయబారి సోవియట్ విదేశాంగ కార్యాలయానికి ఒక జాబు రాశాడు. ఆ జాబులో " ఇలాటి అప్పులు ఇవ్వడాన్ని గురించి అమెరికా ఇంకా ఒక నిర్ధారణకు రాలేదు " అని సూచించబడింది. కాని తర్వాత ఆరు మాసాల్లో మరో దేశానికి (ఇంగ్లండుకి—అనువాదకుడు) 375 కోట్ల డాలర్లు ఋణం ఇవ్వడానికి సంప్రతింపులు జరిగాయి. కాంగ్రెసులోకూడా ఈ విషయం ప్రతిపాదించబడింది. కాని అమెరికా మంత్రివర్గ సభ్యులు ఇప్పటికీ తమకేమీ తెలియనట్లే నటిస్తూ ఉన్నారు. ఈ కుంభకోణమంతా స్టాలినుకు తెలియదనుకుంటున్నారు గాబోలు.

## రష్యా కోరిక తోసివేయబడింది

తన కోడీ, కుంపటీ లేకపోతే అంతటితో ఊళ్లోవాళ్ళ పని అంతా ఆగిపోతుంది అనుకున్నదట వెనకటికి ఒక ముసలమ్మ. అమెరికా ఋణం ఇవ్వలేదని రష్యా చేతులు ముడుచుకొని కూర్చోలేదు. తన ఆర్థిక విధానాన్ని తానే చక్కబరచుకుంది. నూతన పంచవర్ష ప్రణాళికతో రష్యా ముందుకు సాగిపోతూఉంది.

యుద్ధం అంటే ఏమిటో రష్యాకు బాగా తెలుసు. రష్యా సందేహాలు నిరాధారమైనవి కావు. గత యుద్ధానుభవం రష్యాకు ఉన్నంత మరే

దేశానికీలేదు. అనేక కష్ట నష్టాలకు గురిఅయింది. అనేక దక్కా-మొక్కీ-లు తిన్నది. అనేక ప్రాంతాలు శ్మశానంగా మారిపోయాయి. గత యుద్ధంలో 150 లక్షల మందిని రష్యా కోల్పోయింది. ( అమెరికానష్టం కంటె 50 రెట్లు ఎక్కు-వ.) స్త్రీలు, పురుషులు,బాలురు, వృద్ధులు, అనే విచక్షణ లేకుండా అనేక మంది చచ్చిపొయ్యారు. 250 లక్షల మందికి ఉంటానికి ఇండ్లు లేకుండా బోయాయి. కట్టుకోడానికి బట్టలు కూడా కరువయ్యాయి. తింటానికి తిండి దొరక్క- పసిపిల్లలుకూడా మలమల మాడి పోయ్యారు. ఇన్ని బాధలు పడుతూ కూడా తమ పవిత్ర మాతృ భూమిని దగ్ధంజేయాడానికి సిద్ధమైన పాసిస్టు రాక్షసుల్ని. ఓడించడానికి ఆబాలగోపాలం అంతా ఒక్కటిగా నిలబడ్డారు. శత్రువుల్ని చీల్చి చెండాడి తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకున్నారు.

19.9 నాటి యుద్ధాన్ని కూడా రష్యా ఇంకా మరచిపోలేదు. సోవియట్ యూనియన్ ఇంకా బాల్యదశలో ఉండగా బ్రిటన్. ఫ్రాన్సు. చైనా అమెరికా, జర్మనీ, జపాన్ వగైరా 14 దేశాలు ఒక్కుమ్మడిగా తన్ను నాశనం చేయడానికి నడుంగట్టిన ఆరోజులు ఇంకా రష్యా స్మృతిపథంలో తిరుగుతూనే ఉన్నాయి

డెబ్బై లక్షల స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, బలి అయిపోయిన ఆ అంతర్యుద్ధ దినాలు. ఇంకా రష్యనుల కండ్లలో మెలగుతూనే ఉన్నాయి. రెండున్నర సంవత్సరాల్లో ఎన్నోసార్లు. రష్యనులు కటికి పస్తులు వండుకున్నారు. అనేక అంటువ్యాధులకు ఆహూతి అయిపొయ్యారు. షుమారు 2,40,000. కోట్ల ఆస్తినష్టమైపోయింది.

పెట్టుబడిదారీ దేశాలన్నీ ఏకమై రష్యాను వెలివేసిన ఆరోజులు ఇంకా రష్యనుల స్మృతిపటం మీద అకింతమయ్యే వున్నాయి. రష్యామీద ఎన్నో అభూత కల్పనలు కల్పించారు. పచ్చి బూతులు ప్రపంచమంతట ప్రచారం చేశారు. బహిరంగంగా అనేక కుట్రలు పన్నారు. ఎవళ్ళుఎంత దుష్ప్రచారం చేసినా, ఎంతదుమ్మెత్తి పోసినా, రష్యామాత్రం ధృవనక్షత్రం లాగ చిరస్థాయిగా ప్రకాశిస్తూ ఉంది.

## ఎంతో కాలంవరకు సోవియట్ రష్యాను గుర్తించలేదు.

రష్యాలో సుస్థిరమైన ప్రభుత్వం నెలకొన్న తర్వాత గూడా, బ్రిటన్ దాన్ని గుర్తించడానికి ఎంత కాలముపట్టిందో రష్యనులు ఇంకా మరచి

పోలేదు. సోవియట్ ప్రభుత్వం ప్రపంచంలో ఒక బలవత్తరమైనశక్తిగా పెంపొందినా అమెరికా దాన్ని గుర్తించడానికి ఒక దశాబ్దంపైగా బట్టింది.

నానాజాతి సమితిలో తానుకూడా చేరడానికి ఈపెట్టుబడిదారీ దేశాలు ఎన్ని అభ్యంతరాలు కలిగించాయో ఎన్నిఆటంకాల్ని అతిక్రమిస్తే చివరకు తానుకూడా ఒక మెంబరుగా చేరగలిగిందో రష్యాకు ఇంకా బాగా జ్ఞాపకంఉంది. ప్రపంచభద్రతకోసం నానాజాతి సమితిలో రష్యాఎంతకృషి జేసినా బ్రిటన్ అమెరికా దేశాలు దాన్ని ఎలా విచ్ఛినం చేశాయో అప్పుడే రష్యా ఎలా మరచి పోతుంది?

తన కండ్లముందే హిట్లరు ఏవిధంగా ఫాసిస్టు సైన్యాన్ని సమీకరించాడో, ఏ యే శక్తులు హిట్లరుకు సహాయం జేశాయో రష్యాకుఇంకా గుర్తుంది. మ్యూనిచ్ కుతంత్రంలో పాల్గొన వలసిందని పంపిన ఆహ్వానాన్ని రష్యా ఎందుకు నిరాకరించిందో మనం మరచిపోయినా రష్యా ఏలా మరచిపోతుంది?

యాంటి - కోమింటరన్ ఒడంబడిక (కమ్యూనిస్టుపార్టీలను నాశనం చేయడానికి అక్షరాజ్యాలు చేసుకున్నవడంబడిక) చాటున జర్మనీ జపాన్ దేశాలు రష్యాను నాశనం చేయడానికి ఎన్నికుట్రలు బన్నాయో రష్యాకు తెలుసు. ఫాసిస్టుల దురాక్రమణ సిద్ధాంతాన్ని ఖండించకుండా పెద్దపెద్ద దేశాలు ఆనాడు ఏవిధంగా నోరుమూసుక కూర్చున్నాయో రష్యాకు స్వానుభవమే.

సోవియట్ యూనియన్ లో జరుగుతూవున్న విశేషాలు ఇతరప్రపంచానికి తెలియకుండా రష్యాకు మధ్యప్రాచ్యం, మధ్య ధరాప్రాంతం, బాల్కన్ దేశాలు ప్రాచ్యయూరప్ దేశాలకుమధ్య ఏవిధంగా పెద్ద అడ్డుగోడ గట్టారో రష్యాస్వయంగా తన కండ్లారా చూచినసంగతే.

ఈ విషయాలన్నీ రష్యాకు కామాలతోసహా ఇంకాజ్ఞాపకం ఉన్నాయి. ఏకాకిగావున్న రష్యామీదికి హిట్లరు వ్యాఘ్రాన్ని ఏవిధంగా ఎవరు కవ్వించారో రష్యాకు తెలుసు. అరువుకౌలుబిల్లు రష్యాకు వర్తింప జేయకుండా రష్యాను వెన్నుపోటు పొడవటానికి ఎన్నిమాయవేషాలు బన్నారో రష్యాకు మరొకరు చెప్పనక్కర్లేదు. నిస్సహాయంగా ఉన్న రష్యా హిట్లరు దెబ్బలతో, ఫాసిస్టు పెడబొబ్బలతో, ఊరూపేరూ లేకుండా ఎగిరిపోతుందని కలలు గన్నారు. కాని వారి కలలన్నీ కల్లలయ్యాయి. చరిత్రే దీన్ని రుజువుచేసింది.

## గుడ్డితనం

ప్రపంచంలోకల్లా గొప్ప వైమానిక నౌకాసైన్యాలు మనకేఉన్నాయి. అన్నిటికి మించిన అటంబాంబు మన చేతుల్లో ఉంది. కాబట్టి అందరికంటె మనమే గొప్పవాళ్ళ మనుకోవడం, ఆత్మరక్షణ అనే పేరుతో పశ్చిమ ప్రాంతం, పసిఫిక్ మహాసముద్రము, జపాన్, మధ్యచైనా, ఉత్తరాన ఐస్‌లేండ్‌నుంచి తూర్పున అజోర్సునరకు గల అట్లాంటిక్ మహాసముద్రం మీదకూడా మనకే అధికారం కావాలంటే అర్థమేమిటి?

అలాగే బ్రిటన్‌కూడా ఆత్మరక్షణకోసమే పశ్చిమయూరప్, మధ్యధరాప్రాంతం, సమీపప్రాచ్యం, ఆఫ్రికా, నైరుతి ఏషియాలతోపాటు సప్త సముద్రాలమీదా తనకే అధికారం కావాలంటే రష్యాదీన్ని ఎలా అర్థం జేసుకుంటుంది? యుద్ధంవల్ల ప్రజలేవిధంగా బాధపడతారో రష్యాకు తెలిసినంత చక్కగా మనకెవరికి తెలియదు. ఇంగ్లీషువాళ్ళకుకూడా తెలియదని అందరూ ఒప్పుకొని తీరాలి. ఇప్పుడు జరుగుతూవున్నదంతా యుద్ధ సన్నాహం గాక మరేమిటి? ఒకేతరంలో రెండుప్రపంచమహాయుద్ధాలా?

ఈ విషమ పరిస్థితులనుంచి బైటబడే మార్గం ఏమయినాఉందా?

గుడ్డిగా నేడు యుద్ధాన్ని రెచ్చగొడుతూ ఉన్న శత్రువులు ఎవరు?

జాతీయదురహంకారం మన మొదటి శత్రువు? ఎంతబలవత్తర మయిన జాతిఅయినా నేడు ఏ ఒక్కజాతి మడిగట్టుకొని సురక్షితంగా ఉండలేదు. ఫారెన్‌రిలేషన్సు కమిటీ చైర్మన్ సెలవిచ్చినట్లు ఎంతగొప్ప సాయుధసంపన్నమైన సైన్యంగానీ, ప్రపంచంలోకల్లా సర్వశ్రేష్ఠమయిన వైమానిక నౌకాసైన్యాలుగానీ, చివరకు అత్యద్భుతమైన అటంశక్తిగానీ, ఏ ఒక్కజాతినీ రక్షించలేదు.

నిర్లక్ష్యభావం (ఎవరినీ లెక్కజేయకుండా మనకుమనమే విఱ్ఱవీగడం) మన రెండోశత్రువు. ఈ నాడు బ్రిటన్‌గానీ, రష్యాగానీ, అమెరికాగానీ 'ధూమహంకాళీ' అన్నంత మాత్రాన భయపడే స్థితిలోలేవు. ఈ దేశాల్ని అదిరించి బెదిరించి లొంగదీయడం ఎవరి తరం గాదు.

రెండు నాలుకలతో వ్యవహరించడం, లేక ఉభయ పక్షాలమధ్య జేరి ఇద్దరి నెత్తిన టోపీ బెట్టడానికి ఆలోచించడం, మన మూడోశత్రువు. ఈ తప్పుడు విధానానికి మరే కొత్త పేరు బెట్టినా ఈ రోజుల్లో యిది. చలామణి గాదు. ఈ విధానం ఎప్పుడో తుప్పు బట్టి చివికి జీర్ణమైపోయింది.

ఈ నాడు ప్రపంచాన్ని ఎదుర్కొంటూ ఉన్న విషమ పరిస్థితుల నుంచి బైట బడటానికి మిత్రరాజ్య సమితి ( యునైటెడ్ నేషన్సు ఆర్గ నైజేషన్ ) ఒక సాధన కాదు. కాజాలదు.

## అగ్ర రాజ్యాలలో ఐక్యత అవసరం

అగ్రరాజ్యత్రయం యొక్క ఐక్యతాసూత్రం మీద ఆధారపడే మిత్ర రాజ్య సమితి నిర్మించ బడింది. అమెరికన్ సెనేట్ సభ్యులు కొందరు భావించి నట్లు మిత్రరాజ్య సమితి సర్వాధికారాలు గల ఒక ప్రపంచ ప్రభుత్వం గాదు. అది ఒక స్వతంత్ర దేశాల సమిష్టి సంఘం మాత్రమే.

అగ్ర రాజ్యత్రయంలో ఏ ఒక దేశాన్ని కూడా వ్యతిరేకించి పని చేసే ఉద్దేశంతో అసలు సంయుక్త జాతుల సమితి ఏర్పడలేదు. పరస్పర సమానత లేని ఈ జాతుల సమితిలో 'వీటో' అధికారం ఒక ప్రధాన సూత్రంగా గుర్తించబడింది. అలా గుర్తించడం కూడా చాలా అవసరమే. అగ్ర రాజ్యత్రయంలో వచ్చే అభిప్రాయ భేదాల్ని పరిష్కరించడానికి (స్వతంత్ర, అస్వతంత్ర జాతులతో కూడుకొన్న) ఈ మిత్రరాజ్య సమితికి అధికారం ఇవ్వడం చాలా ప్రమాదకరం. మిత్రరాజ్యసమితికి అలాటి అధి కారంకూడా ఉండాలని ఇవ్వాళ వాదించేవాళ్ళు బుద్ధిపూర్వకంగా అసలు ప్రధాన సూత్రాన్నే తికమకలు జేయాలని చూస్తున్నారు. అగ్ర రాజ్యత్ర యంలో వచ్చే అభిప్రాయ భేదాల్ని పరిష్కరించడానికి మిత్రరాజ్యసమితి ఒక నిర్ణయం తీసుకుంటే ఏ ఒక అగ్రరాజ్యమైనా తన వీటో అధికారాన్ని ఉపయోగించవచ్చు. అగ్రరాజ్యాలలో ఏ ఒక దేశాన్ని వ్యతిరేకించి మిత్ర రాజ్య సమితి ఏ నిర్ణయాన్ని తీసుకోలేదు. సెనేట్‌లో మనం ఈ సూత్రాన్ని అంగీకరించినప్పుడు ఇందులో ఉన్న సాధక బాధకాలన్నీ తెలుసుకొనే ఆనాడు దాన్ని సమర్థించాం. డంబార్టన్ఓక్సులోను, శాన్ఫ్రాన్సిస్కో లోను జరిగిన సమావేశాల్లో ఈ విషయాలన్నీ ముందుగా ఆలోచించే ఆ నిర్ణయానికివచ్చారు.

అగ్రరాజ్యాల్లో ఏ ఒక దేశాన్ని అయినా వ్యతిరేకించి మిగతా రెండు అగ్రరాజ్యాలు ఒక నిర్ణయాన్ని బలాత్కారంగా అమలు పరచడా నికి ప్రయత్నిస్తే మూడో ప్రపంచ మహాయుద్ధం తప్పదు.

అగ్రరాజ్యాల్లో ఏ రెండురాజ్యాలైనా మిత్రరాజ్యసమితి సహాయంతో మూడో పెద్దరాజ్యాన్ని లొంగదీయడానికి పూనుకున్నా మళ్ళీయుద్ధంతప్పదు.

అగ్రరాజ్య త్రయాన్ని వ్యతిరేకించి మిత్రరాజ్య సమితి తన అధికారాన్ని చలాయించలేదు.

బ్రిటిషువారిప్పుడు ఒడంబడిక నమలు పంచడానికి, బ్రిటనుకు ఋణం ఇవ్వడానికి మనం ఏవిధంగా అనుకూల పరిస్థితుల్ని కల్పించుకుంటున్నామో, అదేవిధంగా మిత్రరాజ్య సమితి పనిచేయాలన్నా అందుకు తగిన పరిస్థితుల్ని కలిగించాలి. అప్పుడే 'సమితి' జయప్రదంగా పని చేయ గలుగుతుంది.

## అగ్రరాజ్యత్రయ నూతన సమావేశం

ఈ నాడు ప్రపంచాన్ని ఎదుర్కొంటూఉన్న విషమ పరిస్థితుల నుంచి బైట బడడానికి సరియైన మార్గమేది? సంయుక్తజాతుల సమితి విచ్ఛిన్నమైపోకుండా దాన్ని ఎలా బలపరచాలి. ప్రపంచ శాంతి భద్రతల్ని ఎలా కాపాడాలి?

కీర్తిశేషులైన ప్రెసిడెంటు రూజ్‌వెల్టు మహాశయుని ఆశయాల్ని మనస్ఫూర్తిగా నెరవేర్చాలని కృషి చేయడమే ఇందుకు సరియైన మార్గం. ఇంతకు మినహా మరో గత్యంతరంలేదు. అగ్రరాజ్యత్రయంలో ఐక్యత సాధించడానికి ఆ మహాపురుషుడు తీవ్రంగా ప్రయత్నించాడు. అమెరికా, రష్యా, బ్రిటన్ దేశాలు మూడూ కలసి పనిచేసేటట్లు చేశాడు. మనం కూడా అదే ఆశయంతో పనిచేయాలి. అప్పుడే ప్రపంచ మంతటా శాంతి సౌఖ్యాలు చిరస్థాయిగా నెలకొల్ప బడతాయి. అప్పుడే ప్రతిదేశం ధన ధాన్యాదులతో తులదూగుతూ ఉంటుంది.

సరే—అయితే అసలు ఈ మూడుదేశాల్లో ఐక్యత ఎలావస్తుంది? ఈ మూడు దేశాలమధ్య నేడు గాఢంగా అలముకొన్న మబ్బుతెరలు ఎలా విడిపోతాయి? పరస్పర భిన్నాభిప్రాయాలు గల ఈ మూడు దేశాలు కలసి పనిచేయడం ఎలాగు? అనే సందేహం ప్రతివాడికి కలుగుతుంది.

వెంటనే అమెరికా రష్యా బ్రిటన్ దేశాల ప్రతినిధుల సమావేశం జరగాలి. ఈ సమావేశంలో విదేశాంగ కార్యాలయ ప్రముఖులందరు తప్పక పాల్గొనాలి. ఇలాటి సమావేశాన్ని జయప్రదంగా జరపడానికి నామమాత్ర ప్రతినిధులేకాకుండా శాంతి కాముకులైన పురోగాములందరికి తగిన ప్రాతినిధ్యం ఇవ్వాలి. ఈ నాడు మనల్ని ఎదుర్కొంటూన్న జటిల సమస్య లన్నిటినీ ఈ మీటింగులో పరిష్కరించాలి.

ఈ మీటింగులో వర్తక, రైతు, కార్మిక, మహిళా నాయకులు కూడా పాల్గొనాలి. యుద్ధానికి బలి అయ్యేది ముఖ్యంగా యువకులే కాబట్టి పై సమావేశంలో యువజనులకు కూడా తగిన ప్రాతినిధ్యం ఇవ్వాలి.

ఫలితం తేలేవరకు ఈ సమావేశం ముగియగూడదు. అతి ముఖ్య మైన సైనిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక విషయాలమీద అగ్రరాజ్య త్రయం ఆచరణ సాధ్యమైన ఒక ఒడంబడికకు రావడం ద్వారానే పరస్పర విశ్వాసం కలుగుతుంది. తద్వారా ప్రపంచ భద్రతా సంఘంలో నేడు ఏర్పడిన అభిప్రాయభేదాలు తొలగిపోయి అగ్రరాజ్యత్రయం ఏకాభిప్రాయానికి రాగలుగుతుంది. ప్రతి చిన్న విషయాన్నిగురించి చర్చించి ఈ సమావేశంలో ఒడంబడికలు కుదుర్చుకో నవసరంలేదు. అసలు ప్రధాన సూత్రాలమీద ఐక్యత ఏర్పడితే చిన్న చిన్న విషయాలు వాటంతటవే దారికి వస్తాయి.

అగ్రరాజ్య త్రయంలోవున్న పరస్పర సందేహాలు, అవిశ్వాసాలు తొలగిపోయి ప్రపంచ భద్రతను చిరస్థాయిగా నెలకొల్పడమే ఈ సమావేశంయొక్క ముఖ్య ఆశయం.

## నాజీజాన్ని సమూలంగా నిర్మూలించాలి

ప్రపంచం సురక్షితంగా వుండాలంటే జర్మనీ జపాన్ దేశాలకు మళ్ళీయుద్ధాన్ని రెచ్చగొట్టే ఎటువంటి స్వల్ప అవకాశాన్ని ఇవ్వకుండా ఉండడమే మనం చేయాలిసిన మొదటిపని. ఈ రెండు దేశాల యుద్ధోన్మత్త స్వభావాన్ని పూర్తిగా తుడిచిపెట్టి వేయకపోతే ప్రపంచంలో శాంతి అంటూ ఉండదు. వుంటానికే వీల్లేదు.

కాబట్టి జర్మనీ జపాన్ దేశాల్లో ఇంకా అక్కడక్కడ మిగిలివున్న ఫాసిస్టు శక్తుల్ని నిర్మూగమోటంగా నిర్మూలించివేయాలి. మళ్ళీ ఒక పెద్ద సైన్యాన్ని నిర్మించి ప్రపంచంమీద దాడిసల్పే అవకాశం కలిగించ గూడదు. ఈ విషయంలో ఎటువంటి రాజీ రాయబారాలకు తావివ్వ గూడదు. ఫాసిస్టు పరిపాలనలో జర్మనీ జపాన్ దేశీయుల మనస్తత్వమే పూర్తిగా మారిపోయింది. కాబట్టి ఆ దేశస్థులకు మళ్ళీ మొదటినుంచి సరియైన శిక్షణ ఇవ్వాలి.

ఇక రెండోవిషయం ఆటంబాంబు. అత్యంత మహత్తరమైన పరమాణుశక్తిని ఏ ఒక దేశమో తన గుప్పెటలోదాచి పెట్టుకున్నంతకాలం

ప్రపంచంలో శాంతి భద్రత లుండడం అసంభవం. అమెరికా కుప్పలు తిప్పలుగా ఆటంబాంబుల్ని తయారుజేస్తూ ఉంటే ఈ మహాప్రళయాన్నుంచి తప్పించుకోడానికి రష్యాకూడా తన సర్వశక్తులు ధారపోయకుండా చేతులు ముడుచుకొని కూర్చుంటుంది అనుకోవడం శుద్ధ తెలివి తక్కువ. ఈ సమస్యను సంతృప్తికరంగా పరిష్కరించనంతకాలం ఆటంబాంబు పోటీ అతిఘోరంగా జరక్కతప్పదు.

ఇంతటి నగ్న సత్యాన్ని కూడా ఇంతవరకు మనం అంగీకరించక పోవడంచేత ఇప్పటికే ప్రపంచ శాంతి భద్రతలకెంతో ముప్పు వాటిల్లింది.

పరమాణుశక్తి మానవజాతికి ఒక గొప్ప వరప్రసాదంగా లభించింది. ఈ మహత్తర శక్తిని దురుపయోగం చేయకుండా సదుపయోగం చేసే పక్షంలో మానవసమాజం ఈనాటికంటె ఇంకా ఎన్నోరెట్లు అభివృద్ధి పొందుతుంది. కాబట్టి ఈమహాశక్తిని మిలిటరీ అధీనంలో ఉంచగూడదు. మానవ సమాజాన్ని ధ్వంసం చేయడానికే మిలిటరీ దీన్ని ఉపయోగిస్తుంది. ఆవిరిశక్తిని (స్టీమ్ ఇంజిన్) విద్యుచ్ఛక్తిని (ఎలెక్ట్రిసిటీ) సదుపయోగం చేయకుండా మానవ జాతిని ధ్వంసం చేయడానికే వాటిని ఉపయోగిస్తే ఇప్పటికీ ప్రపంచం ఏమయిపోయేదో?

జపాన్ ఓటమితో ఆటంబాంబు ఉత్పత్తి అంతటితో ఆగిపోవాలిసింది. అలా మనం చేయకపోవడంవల్ల పరస్పర సందేహాలు, అనుమానాలు ఇంకాఎక్కువయ్యాయి. అగ్రరాజ్యాల్లో ఆటంబాంబు పోటీ నానాటికి హెచ్చు పెరిగిపోతూవుంది.

## కార్యక్రమం

పైన సూచించిన సమావేశం జరక్కముందే 'ఆటంబాంబు' నిర్మాణావకాశాలన్నింటిని మనం నాశనం చేయనక్కర్లేదు. అసలు సిద్ధాంతానికి మనం కట్టుబడి ఉంటేచాలు. అగ్రరాజ్యాలు మూడూ పరస్పరం ఒడంబడికలు చేసుకున్న తర్వాత అప్పుడు ఆటంబాంబు నిర్మాణావకాశాలన్నింటినీ మొదలంటా తుడిచిపెట్టి వేయాలి. ఈ పనిని సక్రమంగా ప్రతిదేశం కొనసాగిస్తూ వున్నదీ లేనిదీ పరీక్షించడానికి ప్రపంచ భద్రతా సంఘ ప్రతినిధులకు సంపూర్ణాధికారం వుండాలి.

పరమాణు శక్తితో ప్రమాదకరమైన ఎటువంటి ఆయుధాల్ని తయారు చేయమని మన మందరం ప్రమాణం చేయాలి. తాను తీసుకున్న

ప్రమాణాన్ని ప్రతిదేశం అమల్లోపెడుతూ ఉన్నదీ లేనిదీ పరీక్షించడానికి ప్రపంచ భద్రతా సంఘ ప్రతినిధులకు సంపూర్ణావకాశం ఇవ్వాలి.

పరమాణుశక్తి ప్రపంచ ప్రజలందరి ఉమ్మడి సొత్తుగా ఉండాలి. పరమాణు విజ్ఞానం ప్రతి దేశానికీ తెలియాలి. ఈసిద్ధాంతంమీదనే ఆధార పడి మన ఆటంబాంబు నిర్మాణ సౌకర్యాలన్నిటిని నాశనం చేయాలి. పరమాణుశక్తిని బాంబులకోసం గాకుండా మానవ సమాజాభివృద్ధికోసం స దుపయోగం జేయాలి.

ఈ సూచనలు జూచి చాలామంది పెద్దలు చకితులై పోతారు. పరమాణు శక్తిలాంటి పరమ రహస్యాల్ని ఎంతోకాలం దాచిపెట్టడం అసంభవం అనే విషయాన్ని ఆపెద్దలు గ్రహించాలి. రహస్యంగా దాచి పెట్టడంవల్ల ఆటంబాంబు పోటీ విపరీతంగా పెరిగిపోతుంది. పెరిగి పెరిగి చివరకు యుద్ధానికి దారితీస్తుంది. ప్రతిదేశానికి ఈపరమాణురహస్యం తెలియడంవల్ల యుద్ధాన్ని రెచ్చగొట్టే పెద్దల ఉద్దేశం సన్నగిలుతుంది. అప్పుడే ఆటంబాంబు ప్రమాదాన్నుంచి ప్రపంచం సురక్షితంగా ఉంటుంది.

ఆటంబాంబును యధేచ్ఛగా ఇదేవిధంగా ఉత్పత్తిచేస్తే ప్రపంచానికి ఒక మహా ప్రళయం వాటిల్లుతుంది.

అటం శక్తిని ప్రపంచశాంతి భద్రతలకోసం, ప్రపంచ శాంతిసౌఖ్యాలకోసం సదుపయోగంజేస్తే సర్వసౌఖ్యాలవాలమైన ధనధాన్య సంపత్సమృద్ధితో తులతూగే నూతనప్రపంచాన్ని నిర్మించుకోవచ్చు. ఇంతవరకు మనకు అర్థం గాకుండా ఆయోమయంగా ఉన్న అనేక సహజ సంపదలు మన హస్తగతం చేసుకోవచ్చు. రష్యా వగైరా దేశాల నెత్తిన కత్తిబెట్టి పెత్తనం చలాయించాలనే దురుద్దేశంతో అమెరికా, బ్రిటన్, కెనడాదేశాలు ఆటంబాంబును తమ సొంత సొమ్ముగా వాడుకుంటూఉన్నంత కాలం ప్రపంచంలో శాంతి భద్రతలుండవు. ఉంటానికి అవకాశంలేదు.

ప్రపంచంలో ఉన్న ముఖ్యమైన కీలక స్థానాలన్నీ భద్రతా సంఘ సమిష్టి అధికారంకింద ఉండాలి. ప్రపంచ భద్రతా సంఘ సమావేశంలోని చర్చ నీయాంశాల్లో ఇదికూడా ఒక అత్యంత ప్రధానమైన సమస్య.

ప్రధాన దేశాలన్నీ ప్రపంచంలోఉన్న ఆయువుపట్లన్నీ బట్టుకుంటూ ఉంటే రష్యా చూస్తూ గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటుంది అనుకోవడం శుద్ధ తెలివితక్కువ. రష్యాను నాలుగు గోడలమధ్య బంధించి సైనిక నౌకా స్థానాలకు దూరంగా ఇతర ప్రపంచంతో సంబంధం లేకుండా అట్టి

పెట్టడం అసంభవం. పరమాణు శక్తిని రష్యాకు తెలియకుండా దాచి పెడతాం అనుకోవడం కేవలం వెర్రితనం.

ప్రపంచంలో ఉన్న కీలక స్థానాలన్నీ పట్టుకోడానికి అదేపనిగా అహోరాత్రాలు పాకులాడే బ్రిటన్ అమెరికాలు డార్డినెల్సును గురించి రష్యామీద గోరంతలు కొండంతలుగా ప్రచారం చేయడం కేవలం అహంకారం అనిపించుకుంటుంది. అగ్రరాజ్యాలు ఐక్యంగా కలసి మెలసి పని జేస్తే భద్రతా సంఘంద్వారా సంయుక్తజాతులసమితి కూడా చక్కగా పనిజేస్తూవుంటే ప్రపంచంలో ఇంకా భయభీతులకు తావెక్కడ ? కడుపులో చల్ల కదలకుండా ప్రతిదేశం హాయిగా కాలక్షేపం జేస్తుంది.

'చేతుల్లో తుపాకులు పిస్తోళ్ళు లేకుండా సౌఖ్యప్రదంగా కాలంగడిపే రోజులురావు' అని అనేకమంది అమెరికన్లు అనుకుంటూ ఉండేవాళ్ళు. ఇవ్వాళ మనం ఆయుధాలన్నీ విసర్జించి నప్పటికీ సమిష్టి భద్రతా సిద్ధాంతం కింద ఇంకా ఎక్కువ సురక్షితంగా ఉండగలుగుతున్నాం.

పరిస్థితులెంత విషమంగా ఉన్నాయో నేను గుర్తిస్తున్నాను. అయినప్పటికి యుద్ధం ఒక మహాప్రళయం అనే విషయాన్ని ముందు గ్రహించాలి. యుద్ధాన్ని రెచ్చగొట్టే వాళ్ళగుట్టు బైటబెట్టాలి. సర్వశక్తులు ధారవోసి ప్రతి ఒకడు యుద్ధాన్ని తీవ్రంగా వ్యతిరేకించాలి.

ఇక నాలుగో విషయం ప్రపంచంలోవున్న ముడిపదార్థాలన్నీ అన్ని దేశాలకు అందుబాటులో వుండేటట్టు అట్లాంటిక్ ఛార్టరుని ఆచరణలో బెట్టాలి. యుద్ధానికి ప్రాముఖ్యత ఉన్నంతకాలం నూనెగనులకుకూడా ప్రాముఖ్యత ఉండకతప్పదు. రష్యా పరిహద్దులకు బైటవున్న 'నూనె' విషయంలో రష్యాకుకూడా బ్రిటన్ అమెరికాలతోపాటు సరయైన న్యాయం జరగాలి.

ఇటీవల జరిగిన 'నూనె' ఒడంబడికలో బ్రిటన్ అమెరికాలు ఏకమై రష్యాకు బొత్తిగా స్థానం ఇవ్వకపోవడం చాలా విచారకరమైన సంగతి న్యాయంగా ఆలోచిస్తే మధ్యప్రాచ్య నూనె గనులతో రష్యాకు కూడా సంబంధముండాలి. కాని బ్రిటన్ అమెరికాలు ఏకమై ఆ ప్రాంతంలోని నూనెతో రష్యాకు సంబంధం లేకుండా జేశాయి.

మొత్తం ప్రపంచంలో ఒక్క అమెరికాను మినహాయిస్తే నూనె ఉత్పత్తిలో సాదీఅరేబియా అగ్రస్థానాన్ని వహిస్తుంది. సాదీఅరేబియా నూనె వ్యాపారమంతా రెండు అమెరికా కంపెనీల చేతుల్లోఉంది.

ఇరాక్‌లో ఉన్న పెట్రోల్ అంతా బ్రిటిష్, ఫ్రెంచ్, డచ్, అమె. రికన్ అధీనంలోఉంది.

ఇరాక్ పెట్రోల్ గనులమీద బ్రిటన్ పూర్తిగా పెత్తనం చలా. యిస్తూ ఉంది.

విదేశాలు మధ్యప్రాచ్యంలో పెత్తనం కోసం పెనగులాడి నూనె సౌకర్యాల్ని ఏదోవిధంగా తమచేతిలో చిక్కించుకున్నాయి.

మన మెక్సికో నూనె గనుల్ని ఏ ఇతర దేశాలో వచ్చి దోచు కుంటూ మనకు అందులో ప్రవేశార్హత కూడా లేకుండా జేస్తే అప్పుడు మన పరిస్థితి ఎలా ఉంటుంది ? అదే విధంగా రష్యాను ఆనుకొని ఉన్న నూనె గనుల్లో రష్యాకు ప్రవేశార్హతలేకుండాజేసి ఎక్కడోఉన్న బ్రిటను అమెరికాలువచ్చి వాటిని ఉపయోగించుకుంటూ ఉంటే రష్యాకుఎంతకు కష్టంగా ఉండదు ? ఇరాన్ వగైరా దేశాల్లో పొంగిపొరలుతూఉన్న ప్రజా స్వామికోద్యమాన్ని రష్యాబలపరిస్తూ ఉందిఅంటే ఇందులో ఆశ్చర్య మేముంది ? ఆర్థికాధికారంకోసం. పెత్తనంకోసం మనంమాత్రం పెనగు లాడలేదని ధైర్యంగా గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పగలమా ?

నిజంగా మనం పునస్ఫూర్తిగా శాంతిభద్రతల్ని నెలకొల్పాలని అనుకుంటే ఆధునిక ప్రపంచంలోఉన్న అన్నిపదార్థాల్ని, అన్నిఅవకాశాల్ని అన్నిదేశాలు సమానంగా ఉపయోగించుకునేటట్లు చూడాలి. అట్లాంటిక్ చార్టర్ నిర్మాతల్లో ఒకళ్ళమైన మనం ముందుగా దీన్ని ఆచరణలో పెట్టాలి. అగ్రరాజ్యాల్లో ఉన్నపరస్పర అనుమానాల్ని తొలగించాలి. మిత్ర రాజ్య సమితియొక్క భయాన్ని పోగొట్టి సుస్థిరమైన పునాదులమీద అభే ద్యమయిన ఐక్యతను నిర్మించాలి.

## వలసదేశాల సమస్య

ఈ సమావేశంలో వలసదేశాలసమస్య కూడా ఒకప్రధాన చర్చనీ యాంశంగావుండాలి. ఇందులోఒక్క ముడిపదార్థాల సమస్యేకాకుండావలస దేశాల ప్రజాస్వామికోద్యమాన్ని గురించికూడా చర్చించాలి. ఈ ఉద్యమం మీదనే నూతన ప్రపంచభవిష్యత్తు ఆధారపడి ఉంది.

మధ్యప్రాచ్యం నేడొక గడ్డుసమస్యగామారింది. మధ్యప్రాచ్యంలోఉన్న విదేశసైన్యాలన్నింటిని వెంటనే అక్కడనుంచి తరలించాలి. పాలస్తీనాని ధర్మకర్తృత్వసంఘంయొక్క (ట్రస్టీషిప్‌కౌన్సిల్) యాజమాన్యాన ఉట్టి

పెట్టాలి. మధ్యప్రాచ్యంలోని నూనెగనుల తగాదాలు సక్రమంగా పరిష్కారమైతే, ఈ ప్రాంతం సాంఘికంగా ఆర్థికంగా ఎంతో అభివృద్ధి పొందుతుంది. నూతన ప్రజాస్వామ్య ప్రపంచంలో సముచితస్థానాన్ని సంపాదించు కుంటుంది.

అగ్రరాజ్యత్రయ విస్తృత సమావేశంలో 'శాంతిభద్రతలకు' ప్రధానస్థానం ఇవ్వాలని ఇదివరకే సూచించాను. 'అగ్రరాజ్యాల పరస్పర ఆర్థిక సహాయానికి' ద్వితీయస్థానం లభించాలి.

ఈ విషయంలో చొరవదీసుకొని అమెరికాయే ముందుండి నడపాలి. అలానడపలేని పక్షంలో అన్నిటికంటేఎక్కువ నష్టపడేది అమెరికాయే. ప్రజాస్వామికాల్ని బలపరచడమే మన ప్రధానోద్దేశంగా ఉండాలి. మనకున్న అవకాశాలన్నింటినీ పూర్తిగా ఉపయోగించాలి. ప్రపంచం అంతటా మనకు తగినన్ని మార్కెట్లు లేకపోతే మన దేశస్థులందరికి మనం ఉద్యోగాలు చూపించలేము. నిరుద్యోగసమస్యని పరిష్కరించలేము. వ్యావసాయికంగా పారిశ్రామికంగా మనకున్న అవకాశాలన్నిటినీ పూర్తిగా ఉపయోగించుకోలేము. అస్తవ్యస్తంగాఉన్న నేటి ప్రపంచ ఆర్థిక పరిస్థితి మన సహాయం మన ప్రోత్సాహంలేకుండా చక్కబడజాలదు.

ఆర్థికవ్యవస్థ సుస్థిరంగా ఏర్పడనంతకాలం ప్రపంచంలో శాంతి అంటూ వుండదు. ఆర్థిక యుద్ధం మహాప్రమాదకరమయిన యుద్ధానికి దారిదీస్తుంది. ప్రపంచంలోని దేశాలమధ్య పరస్పర ఆర్థిక సహాయం ఉంటే శాంతి సౌఖ్యాలతో సమస్త దేశాలు కళకళలాడుతూ వుంటాయి.

రాజకీయంగా ముడిగట్టుకొని ఇతరదేశాలతో సంబంధం లేకుండా ఉంటే ఎంతనష్టమో ఆర్థికంగా ముడిగట్టుకొని కూర్చున్నా అమెరికాకు అంతేనష్టం.

పుచ్చుకొన్న ఋణాన్ని సరియైన గడువులో తిరిగి ఇచ్చివేయగల శక్తిసామర్థ్యాలున్న దేశానికి అవసరమైన అప్పుఇవ్వకుండా తోసివేయడం అమెరికా క్షేమానికే హానికరం. యుద్ధసమయంలో మన తరఫున పోరాడే దేశానికి 'అరువు కవులు' పద్ధతిద్వారా అవసరమైన సాధనసంపత్తిని సహాయంజేయకపోవడం ఎటువంటి తప్పుడు విధానమో ఇదికూడాఅంతే.

మనయోగ క్షేమాల్ని గురించే నేను ఇంతగా చెప్పుతున్నాను. జీవనోపాధి కోసం మన బంధువులు మన మిత్రులు సముద్రాలు దాటి ఖండఖండాంతరాలకు ఎందుకు వలస పోతున్నారో కొంచెం ఆలోచించండి.

ఈ లక్షలకొలది మన సోదరులు తాము కూడా మనుష్యుల్లాగే జీవించాలని ఆరాట పడుతున్నారు. ఎవరి భూమిలోవారు సౌఖ్య ప్రదంగా జీవితం గడ పడానికి కావలసిన సహాయాన్ని అంతా మనంజేయాలి. ప్రపంచమంతా సుభిక్షంగా ఉండేటట్లుచూడాలి. నిస్సహాయులుగా నిరాధారులుగావున్న తోటి సోదరులందరికి సహాయంజేయుడానికి మనప్రజలు సిద్ధంగావున్నారని మనం ఎరుగుదుము.

బ్రిటిష్ వాళ్లు అడిగిన ఋణాన్ని తోసివేయాలని ఆలోచించడంకూడా శుద్ధ పొరపాటే. తన దగ్గిర ఎల్లప్పుడూ వస్తువులు కొంటూ ఉంటే ప్రజల ఆర్థిక స్థితి చితికిపోవాలని ఏవర్తకుడూ కోరడు. ప్రపంచం అంతా సుభి క్షంగా ఉండాలంటే, మన అమెరికా కూడా సుభిక్షంగా ఉండాలంటే, బ్రిటనా కూడా సుభిక్షంగా ఉండడం అవసరం.

బ్రిటనుకి ఋణం యిచ్చినట్లే రష్యాకుకూడా ఋణం యివ్వడం న్యాయం.'పాతబాకీలన్ని ఏవిధంగా దమ్మిడీలతోసహా లెక్కజూచి చెల్లించి వేశామో అలాగే మీరిచ్చే ఋణాన్నికూడా తప్పకుండా తీర్చుకుంటాం.' అని స్టాలినా నాతో జెప్పాడు. మనం జేసే ఆర్థిక సహాయం (ఋణం)వల్ల యుద్ధంలో నష్టపడిన పరిశ్రమల్ని రష్యాపునర్నిర్మించుకుంటుంది. రష్యా ప్రజల జీవితపరిమాణం పెరుగుతుంది.

పై నుదహరించిన సమావేశంలో ప్రపంచ భద్రతనుగురించి, ఆర్థిక సహకారాన్ని గురించి పరస్పర ఒడంబడికలు కుదిరిన తరువాత రాజకీయ వైజ్ఞానిక విషయాల్లో కూడా వివిధజాతులమధ్య సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవడం ఏమంతకష్టమైన పనిగాదు.

యుద్ధ భయానికి ఆర్థికసంక్షోభానికి మూలకారణాలయిన ప్రధాన సమస్యల్ని సక్రమంగా పరిష్కరిస్తే నూతన ప్రజాస్వామిక ప్రపంచంలో నూతనవిజ్ఞాన వికాసాలతో సమస్తజాతులు మూడుపువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధిచెందుతాయి. అప్పుడే మిత్రరాజ్యసమితి ఏర్పరిచే సాంఘిక ఆర్థిక ఉపసంఘాలు జయప్రదంగా ఆదర్శప్రాయంగా పని జేస్తాయి. అప్పుడే మానవుని కళాకౌశలం రాణిస్తుంది. ప్రకృతి రహస్యాల్ని పరిశోధించి అనేక నూతన విషయాల్ని తెలుసుకుంటాడు. నూతన యంత్రాల్ని నిర్మి స్తాడు. కరువు కాటకాలతో తిండిలేక మలమలమాడె ఈ ప్రపంచం ఆ నాడు నిత్యకల్యాణం పచ్చతోరణంగా కళకళలాడుతూ ఉంటుంది.

మిత్రరాజ్యసమితిని నేను మనస్ఫూర్తిగాబలపరుస్తున్నాను. 'సమితి' మీద నాకు సంపూర్ణవిశ్వాశం ఉంది. నేను పైన సూచించిన ప్రధాన విషయాల్నిగురించి అగ్రరాజ్యత్రయం ముందే ఒక నిర్ణయానికిరావాలి. ఏనిర్ణయానికిరాకముందే భద్రతాసంఘాన్ని సమావేశపరచాలని కొందరు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. ఇందువల్ల అసలు మిత్రరాజ్య 'సమితి' అస్తిత్వానికే ప్రమాదం వాటిల్లుతుంది. ఈ నాడు చర్చించవలసిన సమస్యలు అనేకం ఉన్నాయి. యుద్ధానంతర సమస్యలెన్నో మన్ని ఎదుర్కొంటున్నాయి. అగ్రరాజ్యత్రయంలో ముందు ఐక్యత సాధించ గలిగితే ఈ సమస్యలన్నీ తేలికగా వాటంతటవే పరిష్కార మౌతాయి.

ప్రథమ ప్రపంచ మహాయుద్ధంలో మరణించిన వీరులకు 'అదే అంతిమ యుద్ధం' అని చెప్పాం. మనం జెప్పింది శుద్ధ తప్పు అని తేలిపోయింది. యుద్ధంలో మరణించిన వీరుల్ని మనం బుద్ధిపూర్వకంగా మోసం జేయకపోయినా మనం ఇచ్చిన మాటను నిలుపుకోలేకపోయాం.

ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని సాగించాం. లక్షలకొలది మరణించారు. ఎన్నో లక్షలమంది వికలాంగులైపొయ్యారు. కాళ్ళూ చేతులూ తెగిపోయాయి. బిడ్డల కోసం తల్లులు విలపిస్తున్నారు. భర్తలకోసం భార్యలు ఏడుస్తున్నారు. వారి ఆశలు నిరాశలయ్యాయి.

మళ్ళీ మూడో యుద్ధానికి తయారు గావడమంటే ఇంత కంటె బుద్ధిమాలిన పని ఏముంది?

## యుద్ధ భీభత్సం

యుద్ధరంగంలో మృత్యువు ఏవిధంగా నృత్యంజేసిందో నా యూరోపు పర్యటనలో కండ్లారా జూచాను. ఆ ప్రదేశమంతా ఒక ప్రత్యక్ష నరకంగా మారిపోయింది. ఆ నాడు జూచిన ఆ భయంకర దృశ్యాల్ని నేను నా జీవితంలో మరచిపోలేను. ఆ సమాధులు, ఆ నాజీ నరకకూపాలు (Concentration Camps) మజాకోసం మానవహింసజేసే ఆ మారణ యంత్రాగారాలు (మర్డర్ ఫ్యాక్టరీలు) తలుచుకుంటే ఇప్పటికీ నాహృదయం జలదరించిపోతూవుంది. కాళ్లూ చేతులు విరిగిపోయి అల్లల్లాడే ఆ అనాథజీవులు, గుక్కెడు గంజినీళ్ళకోసం వలవలయేడ్చే అన్నెం పున్నెం ఎరుగని ఆ పసిపాపలు, తలదాచుకోడానికి ఇల్లూ వాకిలిలేక మండుటెండల్లో ఎండిపోయే ఆ లక్షలకొలది జీవులు నేటికి కండ్లకు గట్టినట్లు

కనపడుతున్నారు. యుద్ధంయొక్క విజస్వరూపమంటే ఏమిటో అప్పుడు నాకు అర్థమయింది.

ఈ రోజు మనకు కావాలిసింది ఏమిటి? ఆ యుద్ధ భీభత్సమా? శాంతి సౌఖ్యాలా?

ఈ విషయంలో అమెరికా ప్రజాభిప్రాయం, అగ్రరాజ్య ప్రజాభిప్రాయం ఏమిటో మనకు బాగా తెలుసు. శాంతికోసం ప్రపంచం అంతా తహ తహ లాడిపోతూవుంది. తమ ముద్దుబిడ్డలు, తమ ప్రాణేశ్వరులు యుద్ధానికి బలి అయిపోతూఉంటే ఏ స్త్రీ గాని ఏ పురుషుడుగాని సహించడు. సహించలేదు.

ప్రజాభిప్రాయాన్ని మన్నించ దలచుకుంటే, లక్షలకొలది సోదర సోదరీమణుల ప్రాణాల్ని కాపాడ దలచుకుంటే, ఏమిచేయాలో మనకే తెలుస్తుంది. ఒకసారి ఎవరిహృదయాన్ని వారు పరిశీలించుకోండి. ఏది మంచో ఏది చెడో మీకే తెలుస్తుంది.

గత యుద్ధానుభవాన్ని బట్టియైనా మన కర్తవ్యమేదో నిర్ణయించుకోవాలి. వందలకొలది సంవత్సరాలనుంచి శాంతి సౌఖ్యాలకోసం ప్రజలు ఆరాట పడుతున్నారు. ఇకనైనా వారి కోరికను చెల్లించండి. ప్రపంచాన్ని మరో యుద్ధగుండంలోకి లాగకండి. సోదర దేశీయులకు ద్రోహం చేయకండి.

ఈ విషయంలో మనం ఏమాత్రం జాగుచేసినా ప్రజలు మన్ని క్షమించరు. మన మొండికాలు అడ్డంబెట్టినా ప్రపంచ పురోగమనాన్ని అరికట్టలేము. ఇకనైనా కండ్లు తెరవడం మంచిది. కొందరు స్వార్థపరుల మాటలువిని మోసపోకండి. ప్రజల కోపాగ్నిలోబడి మిడతల్లాగా ధ్వంసమైపోతాం.

సిరిసంపదలతో పాడిపంటలతో నిత్యకల్యాణం పచ్చతోరణంగా కళ కళ లాడే నూతన ప్రపంచ నిర్మాణానికి అందరు హృదయ పూర్వకంగా తోడ్పడతారని నేను మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను.



# ప్రాచ్య యూరప్ దేశాల్లో నూతన ప్రజా ప్రభుత్వాలు

ఐ. బెయిగిన్,

ఫాసిస్టు రాక్షసుల పాదఘాతాలకింద బడినలిగిపోయిన ప్రాచ్య ఆగ్నేయ, యూరప్ దేశాలు హోరాహోరిగా పోరాడి నాజీ దాస్యాన్నుంచి ఇటీవలనే విముక్తిపొందాయి. రెడ్ ఆర్మీ సహాయంతో స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాయి. నూతనంగా ఏర్పడిన ఈ ప్రజాస్వామికాలు నిజ మైన ప్రజాప్రభుత్వాలు గావని, కొందరు విసుగూ విరామంలేకుండా అదే పనిగా బెట్టుకొని ప్రచారంచేస్తున్నారు. మరికొందరు ప్రబుద్ధులు పీటిని నిరంకుశ ప్రభుత్వాలనీ, ఈ దేశాల్లో పోలీసురాజ్యం విచ్చలవిడిగా సాగి పోతూ ఉంది అనీ, ఈ దేశాలు సోవియట్ దయాదాక్షిణ్యాలమీద ఆధార పడి బతుకుతూ ఉన్నాయి అనీ, నెత్తిననోరు బెట్టుకొని మొత్తుకుంటు న్నారు. ఇన్నాళ్ళనుంచి కలిసిమెలిసి హిట్లరుకి వ్యతిరేకంగా పోరాడిన మిత్రమండలిలో ఇక సామరస్యం ఏర్పడడం అసంభవం అనీ. మరో యుద్ధం రావాలిసిందే అనీకూడా ప్రచారం చేస్తున్నారు.

ఆంగ్లోశాక్సన్ దేశాల్లో (ఇంగ్లండు, అమెరికాలలో) ఈ దుష్ప్ర చారం మరీవిపరీతంగా సాగుతూవుంది. వెనకబడ్డ ఈ దేశాలపైని ఇంగ్లీషు దొరలు ఎన్నాళ్ళనుంచో తమ పెత్తనం చలాయిస్తూ ఉన్నారు. తమయిష్టం వచ్చినట్లు దోపిడీ చేస్తున్నారు. ఇప్పుడు ఇక తమ ఆటలు సాగవనే కడుపుమంటతో లోపల వున్న కావేషాన్నంతా వెళ్ళ గక్కుతున్నారు. ప్రపంచంలోని అన్ని దేశాలకన్న తమ ప్రభుత్వ విధానమే మిన్న అనుకో వడం ఇంగ్లీషువాళ్ళల్లో వున్న ఒకజబ్బు. ఇతరదేశాల్లో ఏర్పడే నూతన ప్రజాస్వామికాల్ని తృణీకారభావంతో చూడడం, ఆంగ్లోశాక్సనులకు ఒక పరిపాటి అయిపోయింది.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం సమస్త మానవజాతిలో ఒక నూతన చైతన్యం కలిగింది. ముఖ్యంగా ఏషియా, యూరప్ ఖండవాసుల్లో ఒక అద్భుతమైన మార్పువచ్చింది. కాని ఆంగ్లో అమెరికన్ పెట్టుబడి

దారులు మాత్రం ఇంకా ఇక్ష్వాకుయుగంనాటి భావాల్లోనే మునకలు వేస్తూ ఉన్నారు. ఉప్పు బట్టిపోయిన ఆ తప్పుడు కాటాలోనే ఈ నూతన ప్రజా స్వామికాల్నికూడా తూస్తున్నారు. వారికి వెనక చూపేగాని ముందుచూపు లేదు. ప్రపంచాధిపత్యంకోసం ప్లానులు వేస్తున్నారు. కాలచక్రాన్ని మళ్ళీ వెనక్కు తిప్పాలని తమ సర్వశక్తులు ధారవోస్తున్నారు. ప్రజాస్వామికం అంటూ బిగ్గరగా అరుస్తూ గొంతు బిగించుకుంటున్నారు. తమ ఎత్తులు సాగకుండా హిమాలయ పర్వతంలాగావచ్చి సోవియట్‌రష్యా అడ్డు పడిందే అని లోలోపల మండిపోతున్నారు. అందుచేతనే విసుగూ విరామంలేకుండా ఆంగ్లో అమెరికన్ పెట్టుబడి దారులు రష్యామీద దుమ్మెత్తి పోస్తున్నారు. రష్యా సిద్ధాంతాల్ని దూషిస్తున్నారు. ఎవళ్ళు ఎంత దుష్ప్రచారం చేసినా నాజీ దాస్యవిముక్తదేశాల్లో లండన్, వాషింగ్టన్, మాస్కో, ప్రభుత్వాలు అవలంబించిన పద్ధతులే వాళ్ళ వాళ్ళ నిజాయితీని రుజువుజేస్తాయి.

సోవియట్ సరిహద్దుల్లో ఉన్న దేశాల్లో ఇప్పుడు ఒక గొప్ప మార్పు వస్తూవుంది. యుద్ధానికి పూర్వం ఈదేశాలు నిరంకుశ ప్రభువుల చెప్పుచేతల్లో ఉండేవి. వాళ్ళు ఆడించే ఆట. పాడించే పాట. ప్రజల్ని స్వేచ్ఛగా కొల్లగొట్టి దోచుకునేవాళ్ళు. విదేశాల్లో ఉండే సామ్రాజ్య వాదులకు తొత్తుల్లాగా అడుగులకు మడుగులొత్తుతూ వాళ్ళ కృపా కటాక్షాల మీద ఆధారపడేవాళ్ళు. యుద్ధ సమయంలో మిత్రమండలికి సహాయం జేసిన రాజులుకూడా అంతకు పూర్వం హిట్లరుకి హారతి బట్టినవాళ్ళే. ఈ ప్రభువుల 'చల్లని' పరిపాలనలో ప్రజలు అనుభవించిన కష్టాలకు అంతులేదు. మొదటి ప్రపంచ యుద్ధం, రెండో ప్రపంచయుద్ధం మధ్య ఎందరో ప్రజలు తిండిలేక అలమటించిపోయ్యారు. ఎంద రెందరో వస్తులు బండుకున్నారు. ఇక చదువు సంధ్యలమాట దేవుడెరుగు? గుక్కెడు గంజినీళ్ళుకూడా గతిలేక ప్రజలు అల్లల్లాడి పోయ్యారు. ఎన్నాళ్ళు ఈ బాధలు సహించడం? ప్రజల ఓర్పుకు కూడా ఒక హద్దుంటుంది. ఎంత మెత్తని దూది అయినా వత్తగా వత్తగా రాయైపోదూమరి? ఆకటి మంటలతో అటమటలాడే ఆ అస్థిపంజరాలే ఎన్నోసార్లు తెగించి తిరుగుబాటు చేశాయి. కాని ఏమిలాభం? ఆ ఉద్యమాలన్నీ రక్తపాతంలో మునిగిపోయ్యాయి.

1939 లో ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం ఆరంభమయింది. పై నుదహరించిన దేశాలన్నీ ఒక్కొకటే ఫాసిస్టు రాక్షసికి బలి అయ్యాయి. ఫాసిస్టు పరిపాలనలో ప్రజల జీవితం సంఘజీవితం రెండూ కూడా నికృష్టంగా మారిపోయింది. పైన పేర్కొన్న దేశాల్లో కొన్ని మిత్రమండలి తరపున, కొన్ని అక్షరాజ్యాల తరపున చేరాయి. ఏ పక్షం లో చేరినా జరిగిన ఫలితం మాత్రం ఒకటే ప్రభుత్వాలు దివాలా తీశాయి. కరువుదేవత కాలికి గజ్జెకట్టి వీరవిహారం చేసింది. తర్వాత రెడ్ ఆర్మీ యుద్ధంలో ప్రవేశించి నాజీ హిట్లర్ని చావుదెబ్బ గొట్టింది. యూరప్‌లో మళ్ళీ స్వేచ్ఛా వాయువులు ప్రసరించాయి. ప్రాచ్య, ఆగ్నేయ, యూరప్ దేశాల్లోవున్న ప్రజలకు మోక్షం కలిగింది. 'ఈ సారి ఎటువంటి ప్రభుత్వాన్ని మనం ఏర్పరచుకోవాలి' అనే సమస్య వారిని ఎదుర్కొంది.

గతించిపోయిన పాత పద్ధతుల్ని అవలంబించరు. పాత ప్రభుత్వాన్ని నెలకొల్పడం అసంభవం. నూతన పరిస్థితుల కనుకూలించే నూతన పద్ధతుల్నే చేపట్టాలి. అయితే ఆ నూతన పద్ధతి ఏది ?

## సామ్రాజ్యవాదుల ఎత్తులు పారలేదు.

ఈ కొత్తదేశాలు తమ సలహాను పాటించి నడుచుకుంటాయి, అని ఆంగ్లో-అమెరికన్ దేశాలు ఆశించాయి. ఈ చిన్నచిన్న దేశాల్లో చీలికలుబెట్టి మళ్ళీ తమ పెత్తనం నిలుపుకుందామని ప్రయత్నించాయి. కాని పాపం వాళ్ళ పాచికపారలేదు. వాళ్ళ ఆశలు నిరాశలయ్యాయి. పరిస్థితులు వాళ్ళ చేతుల్లోనుంచి జారిపోయ్యాయి.

ద్వితీయ ప్రపంచయుద్ధకాలంలో అనేక దక్కా-మొక్కీలుతిన్న ప్రజలు అంత తేలికగా ఆంగ్లో-అమెరికన్ దేశాలు పన్నిన వల్లో పడలేదు. తమ మంచీచెడూ తామే ఆలోచించుకోగలిగారు. ఆంగ్లో అమెరికన్ పెట్టుబడిదారీ ప్రజాస్వామికంలో ఉన్న రాజకీయార్థిక తత్వాన్ని గ్రహించారు. ప్రజాస్వామికం ఒక చెట్టులాంటిది. ఫలాన్నిబట్టి చెట్టును ఎలానిర్ణయిస్తామో అలాగే ఫలాన్నిబట్టే ప్రజాస్వామికంయొక్క మంచిచెడులుంటాయి.

ఉదాహరణకు ఫ్రాన్సును తీసుకోండి. యుద్ధానికిపూర్వం ఫ్రాన్సులో నిజమైన ప్రజాస్వామికంవుంది అనుకొనేవారు. యుద్ధకాలంలో ఆయా ప్రభుత్వాల నిజస్వరూపం స్పష్టంగా బైటపడింది.

దారులు మాత్రం ఇంకా ఇక్ష్వాకుయుగంనాటి భావాల్లోనే మునకలు వేస్తూ ఉన్నారు. తుప్పు బట్టిపోయిన ఆ తప్పుడు కాటాలోనే ఈ నూతన ప్రజాస్వామికాల్నికూడా తూస్తున్నారు. వారికి వెనక చూపేగాని ముందుచూపు లేదు. ప్రపంచాధిపత్యంకోసం ప్లానులు వేస్తున్నారు. కాలచక్రాన్ని మళ్ళీ వెనక్కు తిప్పాలని తమ సర్వశక్తులు ధారవోస్తున్నారు. ప్రజా స్వామికం అంటూ బిగ్గరగా అరుస్తూ గొంతు పించుకుంటున్నారు. తమ ఎత్తులు సాగకుండా హిమాలయ పర్వతంలాగావచ్చి సోవియట్ రష్యా అడ్డు పడిందే అని లోలోపల మండిపోతున్నారు. అందుచేతనే విసుగూ విరామంలేకుండా ఆంగ్లో అమెరికన్ పెట్టుబడి దారులు రష్యామీద దుమ్మెత్తి పోస్తున్నారు. రష్యా సిద్ధాంతాల్ని దూయబడుతున్నారు. ఎవళ్ళు ఎంత దుష్ప్రచారం చేసినా నాజీ దాస్యవిముక్తదేశాల్లో లండన్, వాషింగ్టన్, మాస్కో, ప్రభుత్వాలు అవలంబించిన పద్ధతులే వాళ్ళ వాళ్ళ విజాయితీవి రుజువుజేస్తాయి.

సోవియట్ సరిహద్దుల్లో ఉన్న దేశాల్లో ఇప్పుడు ఒక గొప్ప మార్పు వస్తూవుంది. యుద్ధానికి పూర్వం ఈదేశాలు నిరంకుశ ప్రభువుల చెప్పుచేతల్లో ఉండేవి. వాళ్ళు ఆడిందే ఆట. పాడిందే పాట. ప్రజల్ని స్వేచ్ఛగా కొల్లగొట్టి దోచుకునేవాళ్లు. విదేశాల్లో ఉండే సామ్రాజ్య వాదులకు తొత్తుల్లాగా అడుగులకు మడుగులొత్తుతూ వాళ్ళ కృపా కటాక్షాల మీద ఆధారపడేవాళ్ళు. యుద్ధ సమయంలో మిత్రమండలికి సహాయం జేసిన రాజులుకూడా అంతకు పూర్వం హిట్లరుకి హారతి బట్టినవాళ్ళే. ఈ ప్రభువుల ‘ చల్లని ’ పరిపాలనలో ప్రజలు అనుభవించిన కష్టాలకు అంతులేదు. మొదటి ప్రపంచ యుద్ధం, రెండో ప్రపంచయుద్ధం మధ్య ఎందరో ప్రజలు తిండిలేక అలమటించిపోయ్యారు. ఎంద రెందరో పస్తులు బండుకున్నారు. ఇక చదువు సంధ్యలమాట దేవుడెరుగు? గుక్కెడు గంజినీళ్ళుకూడా గతిలేక ప్రజలు అల్లల్లాడి పోయ్యారు. ఎన్నాళ్ళు ఈ బాధలు సహించడం? ప్రజల ఓర్పుకు కూడా ఒక హద్దుంటుంది. ఎంత మెత్తని దూది అయినా వత్తగా వత్తగా రాయైపోదామరి? ఆకటి మంటలతో అటమటలాడే ఆ అస్థిపంజరాలే ఎన్నోసార్లు తెగించి తిరుగుబాటు చేశాయి. కాని ఏమిలాభం? ఆ ఉద్యమాలన్నీ రక్తపాతంలో మునిగిపోయ్యాయి.

1939 లో ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం ఆరంభమయింది. పై నుదహరించిన దేశాలన్నీ ఒక్కొకటే ఫాసిస్టు రాక్షసికి బలి అయ్యాయి. ఫాసిస్టు పరిపాలనలో ప్రజల జీవితం పశుజీవితం కంటె కూడా నికృష్టంగా మారిపోయింది. పైన పేర్కొన్న దేశాల్లో కొన్ని మిత్రమండలి తరపున, కొన్ని అక్షరాజ్యాల తరఫున చేరాయి. ఏ పక్షం లో జేరినా జరిగిన ఫలితం మాత్రం ఒకటే ప్రభుత్వాలు దివాలా తీశాయి. కరువుదేవత కాలికి గజ్జెకట్టి వీరవిహారం చేసింది. తర్వాత రెడ్ ఆర్మీ యుద్ధంలో ప్రవేశించి నాజీ హిట్లర్ని చావుదెబ్బ గొట్టింది. యూరప్‌లో మళ్ళీ స్వేచ్ఛా వాయువులు ప్రసరించాయి. ప్రాచ్య, ఆగ్నేయ, యూరప్ దేశాల్లోవున్న ప్రజలకు మోక్షం కలిగింది. 'ఈ సారి ఎటువంటి ప్రభుత్వాన్ని మనం ఏర్పరచుకోవాలి' అనే సమస్య వారిని ఎదుర్కొంది.

గతించిపోయిన పాత పద్ధతుల్ని అవలంబించడ. పాత ప్రభుత్వాన్ని నెలకొల్పడం అసంభవం. నూతన పరిస్థితుల కనుకూలించే నూతన పద్ధతుల్నే చేపట్టాలి. అయితే ఆ నూతన పద్ధతి ఏది ?

## సామ్రాజ్యవాదుల ఎత్తులు పారలేదు.

ఈ కొత్తదేశాలు తమ సలహాను పాటించి నడుచుకుంటాయి, అని ఆంగ్లోశాగ్జన్ దేశాలు ఆశించాయి. ఈ చిన్నచిన్న దేశాల్లో చీలికలుబెట్టి మళ్ళీ తమ పెత్తనం నిలుపుకుందామని ప్రయత్నించాయి. కాని పాపం వాళ్ళ పాచికపారలేదు. వాళ్ళ ఆశలు నిరాశలయ్యాయి. పరిస్థితులు వాళ్ళ చేతుల్లోనుంచి జారిపొయ్యాయి.

ద్వితీయ ప్రపంచయుద్ధకాలంలో అనేక దక్కా మొక్కీలుదిన్న ప్రజలు అంతతేలికగా ఆంగ్లోశాగ్జన్ దేశాలు పన్నిన వల్లోపడలేదు. తమ మంచీచెడూ తామే ఆలోచించుకో గలిగారు. ఆంగ్లో అమెరికన్ పెట్టుబడి దారీ ప్రజాస్వామికంలో ఉన్న రాజకీయార్థిక తత్వాన్ని గ్రహించారు. ప్రజాస్వామికం ఒక చెట్టులాంటిది. ఫలాన్నిబట్టి చెట్టును ఎలానిర్ణ యిస్తామో అలాగే ఫలాన్నిబట్టే ప్రజాస్వామికంయొక్క మంచిచెడు లుంటాయి.

ఉదాహరణకు ఫ్రాన్సును తీసుకోండి. యుద్ధానికిపూర్వం ఫ్రాన్సులో నిజమైన ప్రజాస్వామికంవుంది అనుకొనేవారు. యుద్ధకాలంలో అయా ప్రభుత్వాల నిజస్వరూపం స్పష్టంగా బైటబడింది.

ఫిన్లండులో ఆదర్శప్రాయమైన ప్రజాస్వామికం వుంది అని పాశ్చాత్య దేశస్థులు భావించేవాళ్ళు. బ్రిటన్ అమెరికాలు ఫిన్లండును తెగ బొగిడాయి. యుద్ధకాలంలో ఫిన్లండు బండారం కాస్తాబైటబడింది.

అందాకా ఎందుకు ? సోవియట్ రష్యాతో భుజంభుజం కలిపి హిట్లరుతో పోరాడిన ప్రధానదేశాలు బ్రిటన్ అమెరికాల విషయమే తీసుకుందాం.

ఆంగ్లోశాగ్జన్ దేశాల్లో ఉన్న ప్రజాస్వామికం ఒక చారిత్రక పరిణామ ఫలితం. అదేప్రజాస్వామికంయొక్క ఉన్నతదశ అనుకోవడంపొరపాటు. నాజీ దాస్యవిముక్త దేశస్థుల్ని గుడ్డిగా లండన్‌ప్రభుత్వాన్నిగాని. వాషింగ్టన్ ప్రభుత్వాన్నిగాని అనుసరించమంటె వెంటనేవారడిగే ప్రశ్నలివి.

## బ్రిటను బండారం

- యాభై కోట్ల మంది ప్రజలమీద అధికారం చలాయించే బ్రిటన్‌లో దాదాపు సగం మంది చాలీచాలనితిండితో ఎందుకు బాధపడుతున్నారు ?

- తలదాచుకోదానికికూడా మరెక్కడా స్థలంలేని నిరుద్యోగులతో లండన్ పార్కులు వేసవికాలంలో ఎందుకు అలా కిటకిట లాడుతూ ఉంటాయి ?

- యుద్ధకాలంలో అదృశ్యమైపోయిన నిరుద్యోగ సమస్య మళ్ళీ ఇప్పుడు ఎందుకింత భయంకరస్వరూపం దాల్చింది ?

- వలసదేశాల ప్రజలు చెమటోడ్చి పస్తులుండి రేయింబవళ్లు కష్టించిన కష్టార్జితంతో ఇంగ్లండులో కాలుమీద కాలువేసుకొని కూర్చొనే తెల్లదొరల బొర్రలు ఎందుకు నిండాలి ?

- పత్రికా స్వాతంత్ర్యం అని పెద్ద పెద్ద ఉపన్యాసాలుదంచే ఇంగ్లండులో పత్రికలమీద సర్వాధికారం ఒక అరడజను పెట్టుబడి దారుల చేతుల్లోనే ఎందుకుండాలి ?

- హిట్లరు ముసోలినీలకు కుడిభుజంగా ఉండి స్పెయిన్ ప్రజాస్వామికాన్ని రక్తప్రవాహంలో ముంచెత్తిన పచ్చిఫాసిస్టు ఫ్రాంకోను బ్రిటిష్ టోరీ ప్రభుత్వమే కాకుండా లేబరు ప్రభుత్వంకూడా ఎందుకు బలపరుస్తూ వుంది ? పడిపోతూవున్న ఫ్రాంకోను నిలబెట్టడానికి ఎందుకు నానావస్థలు పడడం ?

● బ్రిటిష్ టోరీ, లేబరు ప్రభుత్వాలు రెండూ గ్రీసులో అభివృద్ధి విరోధకులైన ప్రజాశత్రువులతో ఎందుకు చేతులు కలుపుతున్నాయి ?

● ఇండోనేషియా స్వాతంత్ర్యోద్యమాన్ని అణగగొట్టి డచ్చిరాజీని మళ్ళీ సింహాసనం ఎక్కించడానికి బ్రిటిష్ సైన్యం ఎందుకు పోరాడుతూ వుంది ?

● జర్మనీకి తగినంత సైనిక బలసంపత్తి ఉండాలని బ్రిటన్ వాదించడంలో అర్థమేమిటి ? నాజీ పార్టీని పూర్తిగా విచ్ఛిన్నం చేయడానికి ఇంత దొంగనాటకం ఆడడం ఎందుకు ?

● విముక్త యూరప్‌లో వున్న పెట్టుబడిదారులు, అభివృద్ధి విరోధకులు అందరూ ఒక్కుమ్మడిగా బ్రిటన్ చంకకిందదూరి ఎందుకు తాళం వేస్తున్నారు ?

శరపరంపరగా ఈలాటి ప్రశ్నలు ఇంకా ఎన్నోకురిపిస్తారు. అసలు విషయాన్ని తెలుసుకోడానికి ప్రస్తుతం ఇంతవరకు చాలు అనుకుంటాను.

## ఇక అమెరికా విషయం

● కోటికి పడగ లెత్తిన పెద్దపెద్ద కోటీశ్వరుల కెందరికో ఆటపట్టయి 'లక్ష్మీ విలయం' అనిచెప్పబడే అమెరికాలో లక్షలకొలదిప్రజలు నిరుద్యోగ సమస్యతో ఎందుకు బాధపడాలి?

● మాది ఉత్తమోత్తమ ప్రజాస్వామికం అని వేదికలెక్కి గర్జించే అమెరికన్ పెద్దలే నీగ్రోజాతి మనుష్యుల్ని ఊరూ మొహూ లేకుండా పట్టపగలే రోడ్లమీద కాల్చివేయడంలో అర్థమేమిటి? (లించింగ్)

● పట్టపగలే ప్రజల్ని కొల్లగొట్టే బందిపోటు దాడుల్ని అమెరికన్ ప్రభుత్వం అరికట్టలేక పోయిందంటే కారణమేమిటి?

● లండన్ ప్రభుత్వం లాగే అమెరికన్ ప్రభుత్వంకూడా రక్తపిపాసి ఫ్రాంకోను బలపరచడంలో ఉన్న అంతరార్థమేమిటి?

● చైనాలో అమెరికా సైన్యం తిష్ఠవేయడంలో అర్థం ఏమిటి? అభ్యుదయకర శక్తుల్ని దెబ్బగొట్టి చైనామితవాదులకు ఎందుకుసహాయంజేయాలి?

● జర్మనీ జపానులు పూర్తిగా ఓడిపోయినా, ప్రపంచంలోని కీలక స్థానాలన్నీ పట్టుకోడానికి అమెరికాకు ఇంత ఆదుర్దా ఎందుకు?

— ఎవరితో యుద్ధం జేయడానికి ఈకీలకస్థానాలు పట్టుకోడం?

● ఆటం బాంబు రహస్యాన్ని కోటి మిత్రదేశాలకు గూడా చెప్పకుండా గుప్తంగా దాచిపెట్టడంలో ఉన్నచిదంబర రహస్య మేమిటి ?

ఇదేవిధంగా అమెరికా విషయంలో కూడా అనేకప్రశ్నలు ఎదు ర్కొంటాయి. వాటి అన్నిటినీ ఇక్కడ ఏకరువుబెట్టడం అనవసరం.

ఆంగ్లో అమెరికన్ పెట్టుబడిదారీ దేశాల నిజస్వరూపం ఇదే. ఆదేశాల్లో ఉన్న ప్రజాస్వామికం నేతిబీరకాయ లాంటిది ? కొందరు పాశ్చాత్య రాజ కీయ ప్రముఖులు ప్రజాస్వామికం క్రమక్రమంగా అభివృద్ధి పొందుతూ ఉంది అనీ, రెండువందల సంవత్సరాల్లో ఈ పెట్టుబడిదారీ ప్రజాస్వామికం కిందనే భూలోకం స్వర్గలోకంగా మారుతుంది అనీ జోస్యం చెపుతున్నారు. ప్రాచ్య, ఆగ్నేయ యూరప్ దేశస్థులు ఈలాటి ఎండమావుల్ని నమ్మి బోల్తాగొట్టే అంత అజ్ఞానులుగారు. వాళ్లుచెప్పే జోస్యంకోసం ఎదురు చూడ కుండానే తమ ప్రజలందరికీ కూడూగుడ్డ కల్పించే నిజమైన ప్రజాస్వామి కాన్ని నిర్మించుకున్నారు. ప్రజా స్వామికానికి ఏది దగ్గిందారో వాళ్ళకు తెలుసు. ఆంగ్లో అమెరికన్ పెట్టుబడిదారుల తియ్యని మాటల్ని ఇదివరకు చాలాసార్లు చవిజూచారు. వాళ్ళువేసిన ఉచ్చులో కండ్లు మూసు కొని పడే అంత అమాయికులుగారు.

## ప్రాచ్య ఆగ్నేయ యూరప్‌దేశాల విధానమెటువంటిది ?

ఆదేశాలు నిజమైన ప్రజాస్వామికాన్ని నిర్మించుకున్నాయి. ఆంగ్లో శాగ్జన్ దేశాలు ప్రచారం చేస్తూఉన్నట్లు అది కమ్యూనిజం కాదు. ద్వితీయ ప్రపంచ యుద్ధఫలితంగా ఏర్పడిన ఆయాపరిస్థితుల కనుగుణ్యంగా ఒక నూతన అభ్యుదయ ప్రజాస్వామికం నిర్మించ బడింది. అనేక రాజకీయ ఆర్థిక ఆటంకాల్ని అతిక్రమించి ఈనూతన ప్రజా స్వామికాలు దినదినాభి వృద్ధినందుతూ ఉన్నాయి. రోజు రోజుకు బలపడుతూఉన్నాయి ముమ్ముందు వీటిలోఇంకా కొన్నిమార్పులు రావచ్చు. ఇంకా ఈదేశాలు తాము ఉద్దేశించిన లక్ష్యాన్ని సాధించ లేకపోయినా మొత్తం మీద వాటితాలూకు సులక్షణాలు ఇప్పటికే స్పష్టంగా గోచరిస్తున్నాయి.

పోలండు, రుమేనియా, యుగోస్లేవియా, బల్గేరియా, జెకోస్లోవేకియా, హంగేరీ, దేశాలు రాజకీయంగా ఎంతో ముందడుగు వేశాయి. ఒక చక్కని నూతన ప్రజాస్వామిక పద్ధతిని అవలంబించాయి. (స్త్రీ పురుష విచక్షణ లేకుండా వయోజను లందరికి వోటింగు అధికారం ఉంది. మంత్రివర్గంమీద పార్లమెంటుకు బాధ్యత ఉంటుంది. ప్రజాస్వామిక సూత్రాలమీదఆధారపడి ప్రభుత్వం నడుస్తుంది.) ఫాసిస్టు వ్యతిరేక, ప్రజాస్వామికపక్ష, సంయుక్త సంఘటన సూత్రాల పునాది మీద పరిపాలన కొనసాగుతూ ఉంది.

ప్రజాస్వామిక పక్షాలన్నీ కలసి ఒక సంయుక్తసంఘటనగా పని చేయడం (పైనుదహరించిన దేశాల్లోనేడు జరుగుతూ ఉన్నట్లు) చరిత్రలో ఇదొక కొత్తవిషయంకాదు. యూరోప్‌లోనే ఇందుకు అనేక ఉదాహరణ లుదొరుకుతాయి. ఫ్రాన్సులో 1936లో ఏర్పడిన పాప్యులర్ ఫ్రంటును ఒకసారి జ్ఞాపకం చేస్తేచాలునను కుంటాను.

ఇక అర్థికవిషయాన్ని చూద్దాం. (ఆర్థికవ్యవస్థ చక్కబడకుండా నిజమైన రాజకీయ ప్రజాస్వామికం ఉండడం అసంభవం అని నేడు ప్రజలందరికీ తెలిసిన విషయమే) భూస్వాముల్ని తొలగించి వాళ్ళ ఆధీనంలో వున్న భూమిని రైతులకు స్వంత ఆస్తిగా ఇవ్వడం, బ్యాంకులు, పెద్ద పెద్ద పరిశ్రమలు, రైల్వేలు వగైరా ప్రధాన ఆర్థికోత్పత్తి సాధనాల్ని ప్రభుత్వ పరంచేయడం, ఒక చక్కని ప్లానుతో దేశమంతటా ఆర్థిక జీవితాన్ని సుస్థిరంగా నెలకొల్పడం, — ఇదే ఆర్థిక రంగంలో నూతన ప్రజాస్వామికం యొక్క సారాంశం:

> ఇటువంటి రాజకీయార్థిక వ్యవస్థతో కూడుకొని ఉండడమే అభ్యుదయ ప్రజాస్వామికం యొక్క ప్రధాన లక్షణం. పాశ్చాత్య ప్రజాస్వామికంవలె అధికారాన్ని అంతా ఏరెండువందల కుటుంబాల చేతిలోనో పెట్టకుండా పూర్తిగా ప్రజాపరం చేయడమే నూతన ప్రజాస్వామికం.

ప్రాచ్య, ఆగ్నేయ, యూరప్ దేశాల్లో నేడు నిర్మింపబడుతూవున్న ప్రజాస్వామికానికి ఫ్రాన్సులో 1936 లో ఏర్పడిన పోప్యులర్ ఫ్రంటుకి ఏమైనా తేడా ఉందా?

ఉంది. ఫ్రాన్సులో ఏర్పడిన పాప్యులర్ ఫ్రంటు కంటె పైనుదహరించిన దేశాల్లో నేడు ఏర్పడిన ఐక్యసంఘటన చాలా బలిష్ఠమయింది.

ఈ నాటి ఐక్యసంఘటనకున్న శక్తిసామర్థ్యాలు, విశాల ప్రాతిపదిక, ఆ నాటి పాప్యులర్ ఫ్రంటుకు లేవు. ఈ పదిసంవత్సరాల దీర్ఘకాలంలో ప్రజల విజ్ఞానస్థాయి ఎంతో పెరిగింది. ద్వితీయ ప్రపంచ యుద్ధంవల్ల ప్రజలు స్వయంగా అనేక అనుభవాల్ని గడించారు. నెత్తిపైకెక్కి పెత్తనం చలాయిస్తూవున్న పెట్టుబడిదారుల చేతుల్లోనుంచి ఆర్థికాధికారం యుద్ధసమయంలో చాలావరకు జారిపోయింది. పరిపాలకవర్గం దివాలా తీసింది. దీనితోపాటు కార్మికుల్లో వర్గచైతన్యం అధికమయింది. కష్టజీవులు తమ సంఘబలాన్ని గుర్తించారు.

ఫాసిస్టు రాక్షసి మృత్యుగహ్వరాన్నుంచి ఈ దేశాల్ని కాపాడింది సోవియట్‌యూనియన్. యుద్ధానంతరం ఏర్పడిన ఆర్థిక సంక్షోభంతో అల్లకల్లోలం అవుతూఉన్న దేశాలకి ఆర్థిక సహాయంజేసి ఆదుకొంది సోవియట్ యూనియన్. అన్నిదేశాల, అన్ని జాతుల, స్వతంత్రాధికారాలకి భంగం వాటిల్లకుండా వాటి వాటి హక్కుల్ని గౌరవప్రదంగా రక్షించింది సోవియట్ యూనియన్. సోవియట్ జూపిన సహకార సద్భావాలే ఆయా దేశాల ప్రేమను చూరగొన్నాయి. పశ్చిమ దేశాలతో ఈ దేశాలకుండే సంబంధ బాంధవ్యాల్లో సోవియట్ రష్యా ఏ మాత్రం జోక్యం కలిగించుకో లేదు. పైగా ఇంగ్లండు అమెరికా దేశాలతోను, ఈ దేశాలతోను, సరియైన సంబంధాల్ని ఏర్పరచుకోవడానికి సోవియట్ మనస్ఫూర్తిగా ప్రయత్నించింది, ప్రయత్నిస్తూవుంది. సమాన హోదాలోజరిగే మైత్రే నిజమైన మైత్రిగాని యజమాని బానిసలకుండే సంబంధం మైత్రిఅనిపించుకోదు. ఒకళ్ళ స్వాతంత్ర్యాన్ని మరొకళ్ళు గుర్తించాలి. స్నేహం అంటే 'నానోట్లో నీవు వేలుబెట్టు నీకంట్లో నేను వేలుబెడతాను.' అనే ధోరణిలో ఉండగూడదు. విముక్తదేశాల్లోవచ్చే కొత్తమార్పుల్ని సహృదయంగా బ్రిటన్ అమెరికాలు చూడగలిగి నప్పుడే స్నేహం పొసగుతుంది. తేనె బూసిన కత్తిలాగా పైకి తియ్య తియ్యని మాటలు జెప్పి, ఆదేశాల్ని ఏదో విధంగా దోచుకోవాలని కుట్రలు బన్నుతూ ఉంటే ఇంకామైత్రి సాధ్యమా ? యుద్ధానంతరం యూరోప్‌లోవున్న పరిస్థితి ఇది. దీనితోపాటు ముఖ్యంగా గమనించవలసిన మరో మహత్తర విషయంకూడా ఉంది.

జర్మనీ జపాన్ దేశాల్లోను, తదితరదేశాల్లోను, అక్కడక్కడ మిగిలిపోయి చాటుగా మాటుగా ఇంకా దొంగనాటకంఆడుతూవున్న మిగతా ఫాసిస్టుల్ని కూడా రూపు మాపడం —ఇదే ఈనాటి అత్యంత ప్రధాన సమ

స్య. పార్టీల నిజానిజాలు తెలుసుకోడానికి ఇదే చక్కని గీటురాయి. ఈ సమస్యమీదనే భవిష్యద్రాజ్యాంగ విధానం, ప్రపంచశాంతిసౌఖ్యాలు ఆధారపడిఉంటాయి. ఈసమస్యలోనే మూడో ప్రపంచయుద్ధానికి కావాలసిన బీజాలు కూడా అణగి మణగి ఉన్నాయి. బ్రిటన్ అమెరికాల ఆధిపత్యంకింద వున్నదేశాల్లో— స్పెయిన్‌లో గానీ, పోర్చుగల్‌లోగానీ, ఇటలీలోగానీ, గ్రీసులోగానీ, లేకజపాన్‌లోగానీ, జర్మనీలోగానీ, జరుగుతూ ఉన్నంత తతంగం అంతా ప్రజలుకండ్లారా జూచారు. చూస్తూఉన్నారు. నూతనప్రజాస్వామికాలు ఏర్పడిన సోవియట్ సరిహద్దు దేశాల్లో ఏమిజరుగుతూందో ఆ ప్రజలకు స్వానుభవైక వేద్యమే. ఈఉభయ పక్షాల్ని పోల్చినప్పుడు కండ్లకుగట్టినట్లు కన్పడే హస్తిమశకాంతరాన్ని గురించి ఆప్రజలకు వేరే ఇంకొకళ్ళు బోధించ నవసరంలేదు. నూతన ప్రజాస్వామిక దేశాల్లో ఒక నూతన చైతన్యం పొంగిపొరలుతూంది. ఒక నూతన జీవితం వికసిస్తూ ఉంది. నూతన పరిశ్రమలు నెలకొల్పబడుతున్నాయి. మూడుపువ్వులూ ఆరుకాయలుగా ఆదేశాలు దినదినాభి వృద్ధినందుతూ ఉన్నాయి.

ఉరుకులతో పరుగులతో చరిత్రముందుకు నడిచిపోతూ ఉంది.

ఈ అభివృద్ధినిజూస్తూఉంచే కొందరి ప్రబుద్ధులకు కండ్లు గుడుతున్నాయి. వెనకబడ్డదేశాలు ముందుకు వస్తున్నాయంటే వాళ్ళకితలనొప్పిగా ఉంది. ప్రాచ్య ఆగ్నేయ యూరప్ దేశాల్లో సరియైన ప్రజాస్వామికం లేదంటూ గొంతులు చించుకుంటున్నారు. దీనికంతటికి కారణం ' మాస్కో జోక్యమే ' అని దబ్బావాయిస్తున్నారు. తాతముత్తాతల నాడెప్పుడో బూజుబట్టి పోయి ముంతగూళ్ళల్లో బడిమూల్గుతూవున్న రష్యావ్యతిరేక దుష్ప్రచారాయుధాల్ని ఒక్కొక్కదాన్నే మళ్ళీ పైకిదీసి పదునుబెట్టి లండన్ వాషింగ్టన్ రాజకీయదుకాణాల్లో సరికొత్త సరుకుగా ప్రదర్శిస్తూవున్నారు.

కాని వీరిపప్పులుడకడానికి ఇది 1920 వ సంవత్సరంకాదు. 1946 వ సంవత్సరం. ఈ నాడున్న ప్రపంచం పాతిక సంవత్సరాలనాడు గడచిపోయిన పాతప్రపంచం కాదు.

బూటకాలతో, మాయమాటలతో ఈనాడు ప్రజలు మోసపోరు. ప్రజలుకూడా ఈపాతిక సంవత్సరాల్లో అనేక డక్కామొక్కీలు దిని చక్కటి అనుభవాన్ని సంపాదించారు. ఎన్నికల్లో చావుబ్రతుకులుగా

పోరాడి గెల్చినతర్వాత " మేముకూడా వారివిధానాన్నే అవలంబిస్తున్నాం." అని చెప్పే బూటకప్పుగాజకీయాలగుట్టును ప్రజలు పూర్తిగా గ్రహించారు.

ప్రపంచ యుద్ధానంతరం పాతపరిస్థితులన్నీ మారిపోయ్యాయి. నూతనపరిస్థితుల కనుగుణ్యంగా నూతన ప్రజాస్వామికాలు ఏర్పడాలిసిందే. తల్లకిందుగా తపస్సు జేసినా ఎంతటిఘనుడుకూడా ఈ కాల చక్రాన్ని మళ్ళీ వెనక్కు తిప్పలేడు. నూతన ప్రజాస్వామ్యరథం అవిచ్ఛిన్నంగా జేగీయమానంగా ముందుకు సాగిపోవాలిసిందే. బ్రిటిష్ అమెరికన్ అభివృద్ధివిరోధకులు కూడా ఈ విషయయాన్ని గుర్తించారనుకుంటాను. గుర్తించికూడా తూర్పుయూరప్‌లో నిరంకుశ ప్రభుత్వంకొనసాగుతుంది అని రంకెలు వేయడంలో అర్థమేమిటి? పోలండు, రుమేనియా, బల్గేరియా వగైరా దేశాలఅభివృద్ధికి పానకంలో పుడకల్లాగా అడ్డుపడడంలో వారి వుద్దేశమేమిటి?

● యూరప్‌లో నిజమైన ప్రజా ప్రభుత్వాలు రావడమంటే ఈ ఇంగ్లీష్ అమెరికన్ అభివృద్ధి విరోధకులకు సుతరాం ఇష్టంలేదు. ఈ దేశాల్లో సరియైన ప్రజా ప్రభుత్వాలు ఏర్పడితే వీటిని జూచి తమకు దగ్గిరగా ఉండే దేశాల్లోకూడా ఈ ' జబ్బు ' వ్యాపించవచ్చు. బ్రిటీష్ సామ్రాజ్యంలోకి ఈ ' అంటురోగం ' పాకితే పాపం మరి వాళ్ళపని ఏం గావాలి? ఈ ' అంటురోగం ' ఇంతటితో ఆగుతుందా? లాటిన్ అమెరికాలోకి కూడా ప్రవేశిస్తే అమెరికా కుబేరులగతి ఏం గాను? అందువల్లనే పోలండు, రుమేనియా, బల్గేరియాల్లో కొత్త ప్రజా ప్రభుత్వాలు ఏర్పడుతూ ఉంటే అందరికంటె ముందు వీళ్ళకి నిద్రబట్టటంలేదు. బుర్ర తిరిగిపోతూ ఉంది. కసిదీరా కొత్త ప్రజాప్రభుత్వాన్ని తిట్టిపోస్తున్నారు. ప్రజా స్వామిక పక్షాల ' ఐక్యసంఘటన ' అంటే ముందు వీళ్ళ గుండెల్లో రైళ్లు పరుగెత్తుతాయి. ఔనుమరి! ప్రజాస్వామిక పక్షాల్లో చీలికలు లేకపోతే వాళ్ళ రొట్టెముక్క ఎలా నేతిలోబడుతుంది?

● ఆంగ్లో శాక్సన్ దేశాల్లోని అభివృద్ధి విరోధకులు (ప్రజా స్వామికం అనే పేరుతో ప్రజల్ని తేలికగా మోసగించగలం అనే నమ్మకంతో) సోవియట్ రష్యాని దెబ్బగొట్టడానికి ఎప్పుడు మంచి అవకాశం దొరుకుతుందా అని పొంచి కూర్చు

న్నారు. పరస్పర సహాయంవల్లనే అగ్రరాజ్యత్రయం ఫాసిస్టుల్ని ఓడించింది. కాని, అగ్రరాజ్యత్రయం పరస్పరం ఒడంబడికలు చేసుకోవడం బొర్రలు పెంచుకున్న బ్రిటన్ అమెరికా పెట్టుబడి దార్లకు మొదటినుంచి కంటకంగానే ఉంది. అగ్రరాజ్యత్రయంలో చీలికలు కలిగిస్తేనేకాని వీళ్ళ కోరికలు నెరవేరవు. ఆ ఉద్దేశాన్ని సాధించడానికే వీళ్ళు విధివిరామం లేకుండా రష్యామీద దుష్ప్రచారం చేస్తున్నారు. ఇది ముఖ్యంగా గమనించాలిసిన విషయం.

బ్రిటన్ అమెరికా కోటీశ్వరులు ఎంత త్వరగా ఈ బుద్ధి తక్కువ చేష్టల్ని మానేస్తే ప్రపంచానికి అంతక్షేమం. ప్రాచ్య, ఆగ్నేయ యూరప్ దేశాల్లో ప్రజా స్వామికాభివృద్ధిని అరికట్టడం అసంభవం అనే విషయాన్ని ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది. సిరి సంపదలతో తులదూగుతూ శాంతి సౌఖ్యాలతో ప్రపంచం కళ కళ లాడాలంటే స్వాతంత్ర్యాన్ని అభిలషించే అన్ని దేశాలు పరస్పరం కలసి మెలసి పనిచేయడం ఎంతో అవసరం.

"అన్యథాశరణం నాస్తి"

నేషనల్ ప్రెస్, నారాయణగూడ హైదరాబాదు (దక్కన్)

★

## సోవియట్ యూనియన్‌ను గురించి

# తెలుసు కుంటారా?

## ఐతే ఈ క్రింది పుస్తకాలు చదవండి.

నేటి సోవియట్ యూనియన్
జాతీయ ఐక్యతకు సోవియట్ చూపే మార్గం
సోవియట్ విదేశాంగనీతి—భారతదేశం
సోవియట్ రైతు
సోవియట్ స్త్రీలు
లెనిన్‌గ్రాడ్ యువజన వీరులు
గుండెనిబ్బరం
వీరమాత
రెడ్ ఆర్మీ
ఇంద్రధనుస్సు
సోవియట్ విద్యాలయాలు
ప్రజానాయకుడు స్టాలిన్
మన లెనిన్
సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర

ప్ర తు ల కు

## ప్రజాశక్తి కార్యాలయం,

గవర్నరుపేట, బెజవాడ.

★

